

స్వార్థపరుడు (జా.క) 19



కష్టఫలి 51



మాయాసరోవరం 11



విఘ్నేశ్వరుడు 45



## ఈ సంచికలో



**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ. 120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# మనరైతులు-వాతావరణ సూచనలు!

వాతావరణ పరిశీలనకు సహాయకారిగా ఉంటుందని, ఇతర దేశాలతోపాటు మన దేశం కూడా ఇటీవల ఉపగ్రహాలను ప్రయోగిస్తున్నది. ఈ శాటిలైట్స్ అందించే వాతావరణ సూచనలను రేడియో, టీవీ, వార్తాపత్రికలద్వారా ఎప్పటికప్పుడు ప్రజలకు తెలియజేస్తున్నారు.

అయినా, మన రైతులు మాత్రం వర్షం గురించి ముందుగానే తెలుసుకునే సంప్రదాయ పద్ధతులను ఇంకా మరిచిపోలేదు. సౌరాష్ట్రప్రాంతానికి చెందిన ఒకరైతు ఫలానా పక్షం రోజులలో వర్షం కురుస్తుందని ముందుగానే చెప్పాడనీ; అది అక్షరాలా నిజమయిందనీ ఇటీవల ఒక వార్త వెలువడింది.

సౌరాష్ట్ర రైతు ఆ విషయాన్ని గుజరాత్ వ్యవసాయ విశ్వవిద్యాలయంలోని ఒక శాస్త్రవేత్తకు ఉత్తరం ద్వారా తెలియజేశాడు. మన రైతులు వర్షంరాకను సంప్రదాయ పద్ధతుల ద్వారా ముందుగానే ఎలా తెలుసుకోగలుగుతున్నారన్న విషయంమీద ఆ శాస్త్రవేత్త కొంతకాలంగా అధ్యయనం చేస్తున్నాడు. ఈ విషయంగా విశ్వవిద్యాలయంలో జరుగుతూన్న పరిశోధనలకు ఉపయుక్తమైన సమాచారం అందించడానికి ఆయన దాదాపు 400 మంది రైతులతో ఒక సంఘాన్ని కూడా ఏర్పాటుచేశాడు.

వర్షం రాకను సూచించడానికి వరాహమిహిరుడు (8వ శతాబ్దం), భడ్లీ (12వ శతాబ్దం) వంటి పూర్వకాలంనాటి భారతీయ శాస్త్రవేత్తలు ప్రకృతిలో వచ్చే మార్పులను ఎంతటి సూక్ష్మదృష్టితో పరిశీలించేవారో ఇది మనకు గుర్తుకు తెస్తున్నది. దీనికి వరాహ మిహిరుడి బృహత్సంహిత నుంచి ఒక ఉదాహరణ చెప్పవచ్చు: ఋతుపవనాలు ప్రారంభం కావడానికి 45 రోజుల ముందు పసుపురంగు సంపాక పుష్పాలు అంటే రేలుపువ్వులు విరివిగా పూస్తాయని అది చెబుతున్నది. ఆకాశంలో మారే రంగులను బట్టే అనేక విషయాలను గ్రహించవచ్చని భడ్లీ వెల్లడించాడు.

మార్చ్ 23వ తేదీని ప్రపంచ వాతావరణ దినంగా జరుపుకుంటున్నాం. ఈ రంగంలో పూర్వకాలంనాటి మన శక్తిసామర్థ్యాలనూ; ఇటీవలి కాలంలో భూమిమీదా, జలంలో, అంతరిక్షంలో మనదేశం సాధిస్తూన్న ఘనవిజయాలనూ స్మరించుకునే ఆనంద సమయం ఇది!

సంపాదకుడు : విశ్వం



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 6

భారతదేశ చరిత్ర పుటలను తిరగవేస్తే ఎన్నో యుద్ధాలు జరిగినట్లు తెలియవస్తుంది. అలాంటి కొన్ని యుద్ధాలతో సంబంధం ఉన్నకొందరు హీరోలను గురించిన ప్రస్తావన ఈ ప్రశ్నలలో ఉంది. వారిని గుర్తించగలరేమో చూడండి.

అన్నీ సరైన సమాధానాలుగల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!*

1. ఆ మరాఠా రాజు మొగలులను ఎదిరించి ధైర్యంగా యుద్ధం చేశాడు. ఔరంగజేబు చేత మోసపూరితంగా ఖైదు చేయబడ్డాడు. అయినా తప్పించుకున్నాడు. ఆయన ఎవరు?

.................................................................

2. 1949 జనవరి 15 వతేదీ ఆయన భారత సైన్యానికి సర్వసైన్యాధ్యక్షుడూ, కమాండర్-ఇన్-చీఫ్ పదవిని చేపట్టాడు. ఆ పదవిని చేపట్టిన మొట్ట మొదటి భారతీయుడు ఆయన. ఆయన పేరేమిటి?

.................................................................



3. ఆ చోళరాజు, మహీపాలుడనే వంగదేశపురాజును ఓడించాడు. తన రాజధానికి గంగాజలాన్ని తీసుకువచ్చాడు. అందుకే దానికి గంగైకొండ చోళపురం అనే సార్థకనామం ఏర్పడింది. ఆ రాజు ఎవరో మీకు తెలుసా?

.................................................................

4. ఇండియన్ ఆర్మీకి ఆయనే మొట్టమొదటి ఫీల్డ్‌మార్షల్. ఆయన ఎవరో మీకు తెలుసుకదా? చెప్పండి మరి?

.................................................................

5. మొదటి మైసూరు యుద్ధంలో ఆయన జయించాడు. ఆయన కొడుకు కూడా ఆయన అంతటి గొప్పవాడే. ఆ వీరుడి పేరేమిటి?

.................................................................

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపిన చోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన హీరో ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి

నా అభిమాన హీరో:

.................................................................

.................................................................

పాల్గొనేవారి పేరు: ................................................

వయసు:............. తరగతి: ........................................

చిరునామా:..........................................................

.................................................................

పిన్: ......................... ఫోన్: .............................

పాల్గొనేవారి సంతకం: .......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 ఏప్రిల్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

**హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-6**
**చందమామ ఇండియా లిమిటెడ్**
**82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ**
**ఈకాట్టుతాంగల్, చెన్నయ్-600 097.**

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు





# రాక్షసుడి పుణ్యకార్యం!

దుష్కాముడనేవాడు నిధికోసం వెతుకుతూ దండకారణ్యం చేరాడు. అక్కడ వాడిని రాక్షసుడొకడు పట్టుకున్నాడు. దుష్కాముడికి పైప్రాణాలు పైనే పోయాయి.

అప్పుడు రాక్షసుడు వాణ్ణి సముదాయించి, తన కథ చెప్పాడు:

వాడు చాలాకాలంగా మనుషుల్నీ, జంతువుల్నీ పట్టి తింటూ, అతి నికృష్టమైన జీవితం గడుపుతున్నాడు. ఒక రోజున, ఆ అరణ్యంలో అడుగుపెట్టిన ఒక ఋషీశ్వరుడితో, తన గోడు వెళ్ళబుచ్చుకుని, తనకీ రాక్షసజన్మ వద్దనీ, మామూలు పనులుచేసే మనిషిజన్మ కావాలనీ కోరాడు. ఋషి వాడిని ఏదైనా పుణ్యకార్యం చేయమని చెప్పి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

రాక్షసుడు ఇలా తన కథ చెప్పి, దుష్కాముడితో, "పుణ్యకార్యం చేసేందుకు ఇవ్వాళ నీవు దొరికావు. నా శక్తి చాలా గొప్పది. ఏం కావాలో కోరుకో ఇస్తాను," అన్నాడు. దుష్కాముడు తన పంట పండిందని సంతోషించి, నిధి ఎక్కడుందో చెప్పమన్నాడు.

"నిధితో నీకేంపనో నిజం చెప్పు. అబద్ధం చెబితేమాత్రం, నేను చూపించినా నిధి నీకు కనబడదు," అన్నాడు రాక్షసుడు.

అందుకు దుష్కాముడు, "నిధితో నేను భాగ్యవంతుడినౌతాను. ఆ డబ్బుతో కాకలు తీరిన మల్లులను పోషించి, నా మాటకు ఎదురు చెప్పినవాళ్ళందర్నీ తన్నిస్తాను. నేను ప్రేమించిన విశాలాక్షిని బలవంతంగానైనాసరే పెళ్ళిచేసుకుంటాను," అన్నాడు.

"ఈమాత్రపు దానికి డబ్బెందుకు, మల్లులెందుకు, తన్నులెందుకు? నువ్వు ప్రేమించిన విశాలాక్షికి మంచి మాటలతో, నీ మీద ప్రేమ పుట్టిస్తాను," అన్నాడు రాక్షసుడు.

"కానీ విశాలాక్షి రెండో పెళ్ళివాణ్ణి చేసుకునేందుకు ఇష్టపడదు," అన్నాడుదుష్కాముడు.

"వసుంధర"

ఆ జవాబుకు రాక్షసుడు ఆశ్చర్యపోయి, ''మరి మొదటి పెళ్ళాం ఏమయింది?'' అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే దుష్కాముడు భయపడినవాడిలా చుట్టూ ఒకసారి కలయచూసి, ''ఆమెను గ్రామదేవతకు నైవేద్యంగా పెడితే, నా ఇంట కాసులవాన కురుస్తుందని, ఒక మంత్రగాడు చెప్పాడు. వాడు చెప్పినట్టే చేశాను. కాసులవాన మాత్రం కురవలేదు. రాజభటులు నా వెంటబడ్డారు, వాళ్ళను వదిలించుకుందామన్నా డబ్బు కావాలి. విశాలాక్షి నాకు దక్కాలన్నా డబ్బు కావాలి. అందుకే, నిన్ను నిధి చూపించమని అడుగుతున్నాను,'' అన్నాడు.

''ఒక్కసారికి, ఒక మనిషికి పునర్జీవమివ్వగల శక్తి నాకున్నది. నీ భార్యను బ్రతికిస్తాను. నీ కష్టాలన్నీ తీరిపోతాయి, సరేనా?'' అన్నాడు రాక్షసుడు.

''నా భార్య బ్రతికితే విశాలాక్షిని పెళ్ళి చేసుకోవడం కుదరదు. అందుకే నాకు నిధి కావాలి. ఆ డబ్బుతో అందర్నీ నా అదుపులో వుంచుకోగలను,'' అన్నాడు దుష్కాముడు.

''ఓరి దుర్మార్గుడా! నువ్వు మనిషివేకానీ, నాలాంటి రాక్షసుడికంటే అధముడిలా ఉన్నావు! నిన్ను మంచిగా మార్చాలని, నా ప్రయత్నం నేను చేశాను. మంచి మనిషికి సాయపడితేనే, నేను పుణ్యకార్యం చేసినట్లు మరి! ఈ రోజుకిక నాకు పుణ్యకార్యం చేసే అవకాశం లేదు. మరొక రోజుకు ఎదురు చూస్తూ, ఈ రోజుకు నిన్ను మింగి నాఆకలి తీర్చుకుంటాను!'' అంటూ రాక్షసుడు, దుష్కాముణ్ణి నోట్లో వేసుకుని గుటుక్కున మింగాడు.

మరుక్షణం ఆ ఋషీశ్వరుడు, రాక్షసుడి ముందు ప్రత్యక్షమై, ''దుష్కాముడివంటి నీచుణ్ణి మింగి ఒక మంచికార్యం చేశావు. ఆ విధంగా ఇటీవలి కాలంలో నీకు తెలియకుండానే, నీవెన్నో పుణ్యకార్యాలు చేశావు. కానీ, ఈ రోజు నువ్వు చేసిన పుణ్యకార్యం అన్నింటి కంటే గొప్పది! ఇక నీకు రాక్షస జన్మ నుంచి విముక్తి లభించింది. త్వరలోనే నువ్వు మంచి మనిషిగా జన్మించగలవు— ధన్యుడివి!'' అని చెప్పి ఆశీర్వదించి అంతర్థానమయ్యాడు.



# కుక్కలకు సన్మానం

రాజుగారిని కుక్క కరిచింది. క్రితం రోజు రాత్రి రాజుగారు మారువేషంలో, నగరసంచారానికి బయలుదేరినప్పుడు, ఈ దుర్ఘటన జరిగింది.

గుబురు మీసాలు, పెద్ద తలపాగా, నుదుటిపై పెద్ద పులిపిరికాయతో, వీధిలో నడిచిపోతున్న రాజుగారిని దొంగలా భావించి, ఒక ఊరకుక్క ఆయనపై దాడిచేసి కాలును కరిచింది. రాజుగారు ఏదోవిధంగా అక్కడినుంచి తప్పించుకుని, రాజభవనం చేరాడు.

రాత్రికి రాత్రే వైద్యులు వచ్చి, కుక్కకాటుకు చికిత్స ప్రారంభించారు. ప్రమాదం తప్పిపోయింది.

తెల్లవారుతూండగా ఈ వార్త తెలిసిన సైన్యాధికారి, భయంతో గజగజ వణికిపోతూ, పరుగుపరుగున రాజభవనం చేరాడు. బిక్కమొహం వేసుకుని, రాజుగారి ఎదుట నిలబడి, ''మన్నించండి, ప్రభూ! ఊరకుక్కల్ని ఎప్పటికప్పుడు పట్టి చంపవలసిన బాధ్యత సైనికులకప్పగించాను. కానీ పొరబాటు జరిగింది. వెంటనే స్వయంగా నేనే బయలుదేరి, రాజ్యంలో ఊరకుక్క అనేదే లేకుండా చేస్తాను,'' అన్నాడు.

రాజుగారు నవ్వి, ''నీకు భుజబలమే కానీ బుద్ధిబలం లేదయ్యా! ఒక కుక్క నన్ను కరిచిందని రాజ్యంలోవున్న కుక్కలన్నింటినీ చంపుతానంటావా! అయినా, ఇందులో ఆ కుక్క తప్పేముంది. నా మారువేషం చూసి నన్ను దొంగనుకుంది, కరిచింది. నిజానికి దొంగల్ని పట్టుకోవడం కూడా సైనికుల పనే. అంటే, మనరాజ్యంలో సైనికుల పనికూడా కుక్కలే చేస్తున్నాయన్నమాట. అటువంటప్పుడు, ఆ కుక్కలకు సన్మానం చేయాలి గానీ, శిక్షించడం తప్పుకాదా!'' అన్నాడు.

అవమానంతో తల వంచుకున్న సైన్యాధికారి, నగరంలో కాపలాను కట్టుదిట్టం చేసి, ఊరకుక్కలు కనబడకుండా చేశాడు.

— కుమారి కుంతల



ORISSA
The soul of India

మీకు ఒక క్విజ్

# సిమిలిపాల్

ఒకే ప్రాంతంలో దాదాపు వంద పులులను చూడాలని ఉత్సాహపడుతున్నారా? అలా అయితే మీరు వెళ్ళవలసిన చోటు సిమిలిపాల్ నేషనల్ పార్క్! 'ప్రాజెక్ట్ టైగర్' అనే పులుల రక్షణాపథకం కింద ఏర్పాటు చేయబడిన తొలి జాతీయోద్యానాల్లో ముఖ్యమైనది సిమిలిపాల్ నేషనల్ పార్క్. ఇది ఒరిస్సాలోని మయూర్‌భంజ్ జిల్లాలో ఉంది. దాదాపు 2,750 చ.కి.మీ. విస్తరించి ఉన్న ఈ పార్క్ సందర్శకులకు కనులవిందు చేస్తుంది.

సువిశాలమైన ఈ ప్రాంతంలో రకరకాల భూప్రదేశాలూ, విభిన్నమైన ఎత్తుపల్లాలూ ఉన్నాయి. ఈ ప్రాంతంలో దాదాపు 12 నదులు ప్రవహిస్తున్నాయి. ఒకచోట ఉన్న శీతోష్ణస్థితి మరొకచోట ఉండటం లేదు. అంతటి విశాలమైనది ఈ ప్రాంతం. ఇలాంటి విచిత్ర వాతావరణం వల్ల ఇక్కడ రకరకాల జంతుజాలం నివసించడానికి అనుకూలంగా ఉంటున్నది.

వన్యప్రాణులపట్ల ఆసక్తిగలవారు ఇక్కడున్న చిరుతపులులూ, ఏనుగులూ, మొసళ్ళూ, అసంఖ్యాకమైన సర్పజాతులూ—మొదలైనవాటిని చూసి ముగ్ధులుకాగలరు. పక్షుల అభిమానుల మాటేమిటి అంటారా? సిమిలిపాల్‌లో దాదాపు 230 జాతుల పక్షులు ఉన్నాయి. అందువల్ల వెళ్ళేప్పుడు 'బైనాకులర్స్' తీసుకుని మరీ బయలుదేరండి!

ప్రకృతిసౌందర్యం పట్ల ఆసక్తి ఉన్నవారు మన కేమీలేదా అని నిరుత్సాహపడనవసరం లేదు. ఎటు వైపు చూసినా కనిపించే కొండలూ, కోనలూ, లోయలూ, జలపాతాలూ ప్రకృతి అభిమానులను అలరించి మురిపిస్తాయి.

సిమిలిపాల్ నేషనల్ పార్క్‌లో బరేహిపాణి జలపాత సమీపంలోనూ; జొరాండా, చహాలా నవానా మొదలైన ప్రాంతాలలోనూ బసచేయడానికి తగిన వసతి సౌకర్యాలు కల్పించబడి ఉన్నాయి.

---

మీకు ఒక క్విజ్
14– ఏళ్ళ లోపు పిల్లలకు
పోటీ: 7

1. మనదేశంలో ఎన్ని పులుల సంరక్షణా నిలయాలు (టైగర్ రిజర్వ్స్) ఉన్నాయి?

.......................................................

2. సిమిలిపాల్ నేషనల్ పార్క్‌లో ఒక మొసళ్ళ పెంపక కేంద్రం ఉంది. అది ఎక్కడ ఉందో తెలుసా?

.......................................................

3. ఒరిస్సాలో మహానది తూర్పుకనుమలను దాటుకుని ప్రవహించే చోట ఉన్న 'అభయారణ్యం' పేరేమిటి?

.......................................................

మీ సమాధానాలను చుక్కలతో చూపినచోట స్పష్టంగా రాసి, కూపన్‌ను నింపి ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited**
**No.82, Defence Officers Colony**
**Ekkatuthangal, Chennai - 600 097**

పేరు :..............................................
వయసు :..............................................
చిరునామా :..............................................
..............................................
పిన్ ......................... ఫోన్ ...........




Winners picked by Orissa Tourism in each contest will be eligible for **3 days, 2-night** stay at any of the **OTDC Panthanivas**, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar - 751 014. Ph: (0674) 432177, Fax : (0674) 430887, e-mail : ortour@sancharnet.in. Website : Orissa-tourism.com



# మాయాసరోవరం

## 2

[జయశీలుడు ఒక రాత్రివేళ ఆర్తనాదాలు విని నిద్రలేచి, శ్మశానంలో ఒక వింత ఆకారం తల నరికి, సిద్ధసాధకుణ్ణి రక్షించాడు. తరవాత అతడు దాపులనున్న ఒక ఇంటికి వెళ్ళి, ఆ ఇంటి యజమానురాలైన వృద్ధురాలితో మాట్లాడుతూండగా, హిరణ్య నగర రక్షకుడు, ఇద్దరు మనుషులతో వచ్చి, తలుపు తెరవమంటూ కేకపెట్టాడు. తరవాత-]

వృద్ధురాలు తలుపుదగ్గరకు పోయి ఆగి, జయశీలుణ్ణి, ''నాయనా, నీవేదైనా పెద్దనేరం చేసి తప్పించుకోవడానికి, రాజభటులకు దొరక్కుండా పారిపోతున్నవాడివి కాదుగదా?'' అని అడిగింది.

''అమ్మా, అలాంటి నేరం ఏమీ చెయ్య లేదు. బతుకుతెరువు కోసం దేశాలు పట్టుకుని తిరుగుతున్నవాణ్ణి, అంతే!'' అన్నాడు జయశీలుడు.

వృద్ధురాలు తృప్తిగా తలాడించి గడితీసి, తలుపులు బార్లా తెరిచింది.

నగర రక్షకుడు ద్వారందగ్గరే ఆగి, ''అమ్మా కాటికాపరి పెద్దకొడుకూ, ఒక సిద్ధ సాధకుడూ తగవుపెట్టుకున్న కారణంగా నేను రావలసి వచ్చింది. ఇంతకు ముందు మీ ఇంటికి ఎవరైనా యువకుడు– నడుముకు కత్తితో, వచ్చాడా?'' అని అడిగాడు.

ఆ వెంటనే జయశీలుడు బయటికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే కాటికాపరి కొడుకు కీచుమంటూ వింతగా అరిచి, ''అయ్యా, ఇతడే చచ్చిబతికిన నా తండ్రి తల నరికినవాడు!'' అన్నాడు.

సిద్ధసాధకుడు అతడికేసి కోపంగా చూస్తూ, ''ఒరే, వెధవా! చచ్చిన మనిషి తిరిగి బతకడం ఎక్కడైనా కద్దా? ఈ యువకుడు చంపింది, తన అమోఘశక్తులు గల కత్తితో నీ తండ్రి



నావేశించిన కాలుణ్ణి. ఆ సంగతి దాని నోటంట నేవిన్నాను,'' అన్నాడు.

నగరరక్షకుడు, వాళ్ళిద్దర్నీ కోప్పడి, తనకేసి తలతిప్పేంతలో జయశీలుడు, ''అయ్యా, నాపేరు జయశీలుడు, అమరావతీ నగరంవాణ్ణి. శ్మశానంలో ఒక వికృతాకారుడు, నా మీద కలబడబోయేంతలో, ఆత్మరక్షణకోసం అతడి తల నరకవలసి వచ్చింది,'' అన్నాడు.

''నువ్వు కాలకాలుడి తలకాదు నరికింది, నా తండ్రి తల! ఆయన ఉదయంపూట చనిపోయినట్టు అందరూ అనగా శ్మశానానికి తీసుకువచ్చాను. కట్టెలకోసం నేను దూరంగా పోయిన సమయంలో ఏ దేవత దయవల్లనో ఆయన బతికాడు. నేను తిరిగి వస్తూ, నువ్వాయనతల నరకటం చూశాను,'' అన్నాడు కాటికాపరి కొడుకు కోపంగా.

''ఒరే ఆ శవం ఎవరిదో కూడా చూడకుండానే, నేను నా మంత్రశక్తితో, దానిలోకి కాలుణ్ణి ఆవాహన చేశాను. అప్పుడు, శవానికి ప్రాణం వచ్చింది. కాలుడి ధాటికి తట్టుకోలేక నేను పారిపోతూండగా, ఈ వీరయువకుడు వచ్చి, కాలుడి తల నరికి నన్ను కాపాడాడు,'' అన్నాడు సిద్ధసాధకుడు మరింత కోపంగా.

నగరాధికారి చిన్నగా నవ్వి, జయశీలుడితో, ''నీ పేరు జయశీలుడని కదా చెప్పావు? సరే, ఈ ఇద్దరూ నాలుగైదు గంటల నుంచి ఇలా అర్థం లేకుండా మాట్లాడుతూ, నువ్వు తల నరికినవాడెవడో అంతుబట్టకుండా నా మతి చెడగొడుతున్నారు. ఇందులో ఏదో ధర్మ సూక్ష్మం వున్నట్టు, నాకనుమానం కలుగుతున్నది. సరే, అంతా మంత్రిగారే చూసుకుంటారు. ఇక నా వెంట రా!'' అంటూ నగరరక్షకుడు అక్కడి నుంచి బయలుదేరాడు.

వాళ్ళు రాజభవనాన్ని సమీపిస్తున్నంతలో, మంత్రి అప్పుడే రాజభవనంలో ప్రవేశించబోతున్నాడు. నగర రక్షకుడు, ఆయనకు నమస్కరించి జరిగినదంతా పూసగుచ్చినట్టు వివరించాడు.

అంతా శ్రద్ధగా విన్న మంత్రి కొంచెంసేపు ఆలోచించి, ''వైద్యుడూ, బంధువులూ, అంతా చచ్చిపోయినట్టు నమ్మిన కాటికాపరి తిరిగి బతకడం అసంభవం. సిద్ధసాధకుడు చెప్పినట్టు, వాడి శరీరంలో ఏ కాలుడో ప్రవేశించి వుండాలి. ఏమైనా వాడికి ప్రాణం వచ్చి, లేచి నడిచాడు గదా? అలాంటివాణ్ణి, ఈ యువకుడు తల నరికాడు. అంటే హత్య చేసినట్టే గదా! కాని...'' అంటూ ఆగి, ఏం అనేందుకూ తోచక తల పంకించసాగాడు.

అది అవకాశంగా తీసుకుని జయశీలుడు, ''అయ్యా, తమకు తెలియని ధర్మంకాదు.

ఆత్మరక్షణా ప్రయత్నంలో ప్రత్యర్థిని చుపడం నేరంకాదు గదా!'' అన్నాడు.

''అవును, ఆమాటా నిజమే!'' అన్నాడు మంత్రి, తలమీది నుంచి పెద్దభారం దిగి పోయినవాడిలా పెద్దగా నిట్టూరుస్తూ.

తర్వాత, ఆయన వాళ్ళను అక్కడే ఉండ మని చెప్పి, రాజుగారిని చూడబోయాడు. ఆ సమయంలో కనకాక్షరాజుగారితో, సేనాని కొడుకు మంగళవర్మ మాట్లాడుతున్నాడు. మంత్రిని చూడగానే రాజు, ''మహామంత్రీ! మంగళవర్మ, యువరాజునూ, యువరాణినీ వెతకబోతానని, అనుమతి అడుగుతున్నాడు, నీ సలహా ఏమిటి?'' అని అడిగాడు.

''మహారాజా! ఈ పనికి మంచి సాహ సంతోపాటు, ఏవో అలౌకికశక్తుల సహాయం కూడా గల జయశీలుడనే యువకుడు దొరి కాడు. అతడు ధరించిన కత్తికి ఏవో అమోఘ శక్తులున్నవట!'' అని చెప్పాడు మంత్రి.

కనకాక్షరాజు ఆలోచనలో పడ్డాడు. మంగళ వర్మకు, మంత్రిమీద ఎక్కడలేని కోపంవచ్చింది. అతడు కటువుగా, ''అయ్యా, ఈ జయశీలు డనే అతడు గొప్ప కులీనుడేనా? ఆ సంగతి తేల్చుకోవాలి. మహారాజుగారు, యువ రాణినీ, యువరాజునూ వెతికి తెచ్చినవారికి, అర్ధరాజ్యం ఇస్తామని ప్రకటించారు. అందు కతడు అర్హుడేనా?'' అని అడిగాడు.

ఈ అసందర్భపు ప్రశ్నకు మంత్రి చిరాకు పడుతూ, ''యువరాజునూ, యువరాణినీ అపహరించుకుపోయిన వాళ్ళు, మానవులో, దానవులో, దేవతలో కూడా తెలియదు. అలాంటి పరిస్థితుల్లో వారిని వెతికి తెచ్చినవాడు ఎంత శక్తివంతుడై వుంటాడు! అలాంటివాడు



మహారాజుగారు ప్రకటించిన అర్ధ రాజ్యానికి ఎందుకర్హుడు కాడు?'' అన్నాడు.

''అతడి కత్తికి అమోఘశక్తులున్నమాట నమ్మదగిందేనా? ఒకసారి ఇవ్వమనండి, పరీక్షించి చూస్తాను,'' అన్నాడు మంగళవర్మ.

''బావుంది!'' అంటూ కనకాక్షరాజు తల వూపి, మంత్రితో, ''జయశీలుడి కత్తిని పరీ క్షించేందుకు మంగళవర్మకు ఇప్పించండి. శక్తిగలదైతే, ఆ యువకుడికి గొప్ప బహు మానం ఇచ్చి, మన ఆస్థానంలోనే ఉద్యోగం ఇద్దాం,'' అన్నాడు.

''ఎలాంటి పరీక్ష పెడదాం, మహారాజా?'' అని అడిగాడు మంత్రి.

''మన మృగశాల అధికారితో చెప్పి, బోనుల్లో వున్న రెండు పెద్దపులులను తెప్పించండి. మంగళవర్మ అమోఘశక్తులగల కత్తిని పట్టు కుని, బోనుల్లో నుంచి బయటకు వచ్చిన



పులుల్ని ఎదుర్కొంటాడు,'' అన్నాడు కన కాక్షరాజు.

మంత్రి సంగతి చెప్పగానే, జయశీలుడు సంతోషంగా తన కత్తిని మంగళవర్మకు ఇచ్చాడు. క్షణాలమీద పులులున్న బోనులు తెప్పించబడి చుట్టూ పది అడుగుల ఎత్తున్న ప్రాకారం గోడలమధ్య పెట్టబడినై. మృగ శాలాధికారి, మంగళవర్మను హెచ్చరించి, పైనుంచి బోనుల తలుపులు ఎత్తి, రాజూ, మంత్రీ, జయశీలుడూ వున్న ప్రాకారం మీదికి వెళ్ళాడు. పులులు రెండూ భయం కరంగా అరిచి, మంగళవర్మకేసి రాసాగినై. సేనాని కొడుకు మంగళవర్మ, ఖడ్గ, ధనుర్వి ద్యల్లాంటివి నేర్చినవాడే. కానీ, రెండు పులులు నోళ్ళు తెరిచి, కోరలు చాచి గర్జిస్తూ తనకేసి రావడం చూస్తూనే, అతడికి ఎక్కడలేని భయం పట్టుకున్నది.

మంగళవర్మ భయకంపితుడయ్యాడనీ, ఆ భయంవల్ల కనీసం ఆత్మరక్షణకైనా కత్తిని ఉపయోగించలేకపోవచ్చనీ, అనుమానిం చిన జయశీలుడు, ప్రాకారం పైనుంచి, ''మంగళవర్మా! నీ చేతిలోనిది అమోఘ శక్తులు గల ఖడ్గం. భయపడకు!'' అని కేకపెట్టాడు.

ఆ మరుక్షణం పులుల్లో ఒకటి మంగళ వర్మ మీదికి దూకి పంజాతో అతడి భుజం మీద దెబ్బకొట్టింది. మంగళవర్మ గట్టిగా అరిచి, తనకెలాగూ చావుతప్పదన్న తెగువతో కత్తి ఎత్తి పులిని గుండెల్లో పొడవబోయాడు. కాని గజగజ వణుకుతున్న అతడి చేతి నుంచి కత్తి జారి కిందపడింది.

రానున్న ప్రమాదాన్ని గ్రహించిన సిద్ధ సాధకుడు, ''వీర యువకా, జయశీలా!'' అంటూ పెద్దగా అరిచాడు.

వెంటనే జయశీలుడు గట్టిగా చప్పట్లు చరుస్తూ, పదడుగుల ఎత్తున్న ప్రాకారం మీదినుంచి పిడుగుపాటులా పులుల ముందుకు దూకుతూనే, కిందపడి వున్న కత్తిని చేతికి తీసుకున్నాడు.

ఇది చూసిన కనకాక్షరాజు అబ్బురపడి పోతూ, మంత్రికేసి తలతిప్పి, ''ఎంత సాహసం! ఏమిధైర్యం! సాహసవీరుడైన ఇలాంటి యువకుడి సాయంవుంటే, యువరాజూ, యువరాణీ తిరిగి మనకు లభించే అవకాశం వున్నది,'' అన్నాడు.

ఈ లోపల జయశీలుడు నేలను కాళ్ళతో ఒకసారి గట్టిగా తాటించి, ''ఏయ్!'' అంటూ అరిచి ప్రాకారం గోడకేసి పారిపోతున్నవాడిలా వెనక్కు నాలుగడుగులు వేశాడు. పులుల్లో

ఒకటి రెచ్చిపోయి, అతడికేసి ముందుకు దూకింది. అదే అదనుగా జయశీలుడు ముందుకొక అడుగువేసి, పులి గుండెల్లో కత్తిని బలంగా గుచ్చాడు.

ఆ దెబ్బకు కిందపడి గిలగిల కొట్టుకుంటున్న తనతోటి పులిని చూసి, రెండవ పులి ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, తెరిచి వున్న బోనులోకి బాణంలా పోయి పడింది. ప్రాకారంపై నుంచి కనకాక్షరాజుతోపాటు అందరూ హర్షధ్వానాలు చేశారు.

మంగళవర్మ అప్పటిగ్గాని మూసిన కళ్ళు తెరవలేదు. అతడు చచ్చిపడివున్న పులినీ, బోనులోకి పోయి కోపంగా గుర్రుపెడుతున్న పులికేసీ ఓమారు చూసి, తలపైకెత్తి కనకాక్ష రాజుతో, "మహారాజా, ఈ కత్తికి అమోఘశక్తులున్నమాట నిజం! దురదృష్టవశాత్తు, అది నా చేతినుంచి జారి కిందపడింది. అందువల్ల దాని శక్తిని నేను నిర్ణయించలేకపోయాను. జయశీలుడు ఆ పని గొప్పగా చేశాడు," అన్నాడు.

"లెస్స పలికితివి, మంగళవర్మా! అదృష్టవంతుడివి. భుజంమీద తగిలింది చాలా స్వల్ప గాయంలా వుంది," అంటూ మంత్రి ధర్మమిత్రుడు చిన్నగా నవ్వాడు.

"నేను ముందే చెప్పాను. ఆ కత్తిని కాలుడు స్వయానా దీవించి, జయశీలుడికి ఇచ్చాడు. దానితో కావాలనుకుంటే– అంతో ఇంతో నా సాయంకూడా వుంటే ప్రపంచాన్నే జయించగలడు!" అన్నాడు సిద్ధసాధకుడు పరమానందభరితుడైపోతూ.

"కానీ, అంత శక్తులుగల కత్తే, మంగళవర్మ చేతిలో వుండగా పులిని కూడా చంపలేకపోయింది!" అన్నాడు కనకాక్షరాజు చిరాకు పడుతున్నట్టు.

మంత్రి ధర్మమిత్రుడు ప్రాకారం మీది నుంచి వంగి చేయిచాచి జయశీలుడితో,





''జయశీలా, ఇక పైకి రా! నీ ధైర్యసాహసా లనేకాక, మా సేనాని కుమారుణ్ణి ప్రాణాపా యంనుంచి రక్షించినందుకు అభినందిస్తు న్నాను,'' అన్నాడు.

అందుకు జయశీలుడు, ''అయ్యా, ముందుగా పారిపోయిన పులివున్న బోనును మూయించడం క్షేమం. నేను ప్రాకారం పైకి వస్తే, మంగళవర్మ నిరాయుధుడిగా ఒక్కడే ఇక్కడ వుండిపోవలసి వస్తుంది,'' అన్నాడు.

ఆ మాటలు విన్న సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, ''మంగళవర్మ చేతిలో ఆయుధం వున్నా నిరాయుధుడి కిందే లెక్క. అఖరికి ఇంద్రుడి వజ్రాయుధమైనా–దాన్ని పట్టినవాడు పారు బోతైతే, పూచికపుల్లకిందే జమ!'' అన్నాడు.

జయశీలుడు, మంత్రి అందించిన చేతి సాయంతో ప్రాకారంపైకి రాగానే సిద్ధసాధకుడు అతణ్ణి గట్టిగా కావలించుకుని, ''నువ్వు గుండెలుతీసిన బంటువు! నాకు కాలుణ్ణి వశ పరుచుకునేందుకు సాయపడడమేకాక, మహారాజుకు వారి కుమారుణ్ణీ, కుమార్తెనూ తెచ్చేందుకు తోడ్పడగలవు కూడా,'' అన్నాడు.

తర్వాత అందరూ ప్రాకారం పైనుంచి దిగి, రాజు వెంట భవనంలోకి ప్రవేశించారు. అంతలో, ద్వారందగ్గర నిలబడిన కాటికాపరి కొడుకు పెద్దగా గొంతెత్తి, ''మహాప్రభో! చచ్చి బతికిన నా తండ్రిని చంపినాయన్నుంచి, నాకేదైనా నష్టపరిహారమైనా ఇప్పించండి,'' అని కేకపెట్టాడు.

ఆ కేక విని మంత్రి ధర్మమిత్రుడు వెనక్కు తిరిగి చూసి, రాజుతో ఏదో మాట్లాడి కాటికాపరి కొడుకుతో, ''ఒరే, నీ తండ్రి పోయినందుకు దిగులుపడకు. మహారాజుగారు నిన్ను మొత్తం నగరం, చుట్టుపక్కలా వున్న వల్లకాడులూ, శ్మశానాలమీద పర్యవేక్షణాధికారిగా నియ మించారు. జీతం ఇప్పుడు నీకు ముట్టుతున్న దానికి పదింతలు ఎక్కువ ఇస్తారు. ఇక గొడవ చేయక పో!'' అన్నాడు.

''ప్రభో! చచ్చేవరకూ మీ మేలు మరవను. మా అయ్య చచ్చినందుకు ఒక దిగులు. బతికి మళ్ళీ చచ్చినందుకు మరొక దిగులు. ఆయనే బతికుంటే, ఇప్పటి నా పదవి చూసి ఎంతో సంతోషించేవాడు,'' అన్నాడు కాటి కాపరి కొడుకు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

మంత్రి ధర్మమిత్రుడు చిన్నగా నవ్వుకుని, ''ఇకవెళ్ళు,'' అని కాటికాపరి కొడుకుతో చెప్పి, రాజూ, జయశీలుడూ, సిద్ధసాధకులతోపాటు, సభాభవనంలోకి వెళ్ళిపోయాడు.

కనకాక్షరాజు ఒక ఉన్నతాసనం మీద కొంతసేపు ఆలోచిస్తూ కూర్చుని, తర్వాత

మంత్రితో, "మహామంత్రీ! ఇప్పుడేంచేద్దా మంటారు? యువరాజునూ, యువరాణినీ వెతికి తెచ్చే ప్రయత్నంలో మనవాళ్ళందరూ విఫలులయ్యారు. ఆ భారం ధైర్యవంతుడూ, శక్తిమంతుడూ అయిన, ఈ జయశీలుడి పైన పెట్టడం ఎలా వుంటుంది?" అన్నాడు.

మంత్రి, జయశీలుడికేసి ఓమారు చూసి ఏదో చెప్పబోయేంతలో, సిద్ధసాధకుడు ఆవేశ పడిపోతూ, "మహాదివ్యంగా వుంటుంది, మహారాజా! తమ పిల్లల్ని వెతికి తెచ్చేందుకు ఒక్క ధైర్యమూ, శక్తిసామర్థ్యాలూ మాత్రమే చాలవు! వాటితోపాటు అలౌకికజ్ఞానం కూడా వుండాలి. అందువల్ల, జయశీలుడితో వెళ్ళేం దుకు, నాకూ అనుమతివ్వండి," అన్నాడు.

జయశీలుడు అయిష్టంగా తలాడించి, "మహారాజా, నాదొక మనవి," అన్నాడు.

"అదేమిటో చెప్పు. నీ అభిప్రాయం ఎలావున్నదో వినాలనుకుంటున్నాను," అన్నాడు కనకాక్షరాజు.

"మహారాజా, నేను పుట్టి పెరిగిన దేశం విడిచి, బతుకుతెరువుకు తమ దగ్గర ఏదైనా చిన్న ఉద్యోగం దొరుకుతుందేమో అని వెతుక్కుంటూ వచ్చినవాణ్ణి. అలాంటిదేదైనా ఇస్తే, కృతజ్ఞుణ్ణయి వుంటాను," అన్నాడు.

కనకాక్షరాజు, మంత్రికేసి సాభిప్రాయంగా చూశాడు. ఆ వెంటనే మంత్రి, జయశీలుడితో, "జయశీలా! మహారాజుగారు నీకు ఆస్థానంలో ఉద్యోగం ఇచ్చి, తమ భృత్యుల్లో ఒకడుగా చేర్చు కున్నారు. రాజాజ్ఞ పాలించడం భృత్యుడి ధర్మంగదా!" అన్నాడు.

"ధర్మం ఒక్కటేకాదు, విధికూడా. తక్షణమే ఆజ్ఞాపించండి!" అన్నాడు జయశీలుడు వినయంగా.

మంత్రి ధర్మమిత్రుడు తృప్తిగా తలాడించి, "జయశీలా, నిన్ను యువరాజూ, యువరాణు లను వెతికితెచ్చేందుకు పోవలసిందిగా, మహా రాజుగారు ఆజ్ఞాపిస్తున్నారు," అన్నాడు.

అంతలో రాజుగారి భటుడొకడు, ఒక ముత్యాలహారాన్నీ, సగం విరిగిన కత్తినొకదాన్నీ అక్కడికి తీసుకువచ్చి, "మహారాజా, ఇవి యువరాజూ, యువరాణీ కనిపించకుండా పోయినచెట్టుదగ్గర ఒకబోయవాడికి దొరికాయి. వాడు మతిపోయిన స్థితిలో పడివున్నాడు," అని చెప్పాడు. -( ఇంకావుంది)



# మారిన సన్యాసి

భార్యా, ఇద్దరు పిల్లలూగల రామయ్యకు సన్యాసం పుచ్చుకోవాలన్న చిత్రమైన కోరిక పుట్టింది. తమను వదిలి వెళ్ళిపోవద్దని భార్య ఎంత బతిమాలినా రామయ్య వినలేదు.

''సన్యాసానికి అందరూ అర్హులుకారు. నీ పిల్లలు మరీ చిన్నవాళ్ళు. వాళ్ళకు ఒక దారి చూపించే భారం నీమీదే ఉన్నది గదా!'' అని నలుగురూ చెప్పారు. రామయ్య వాళ్ళ మాటలూ లక్ష్యపెట్టలేదు.

ఒక ఉదయం రామయ్య ఇల్లు వదలటానికి సిద్ధమవుతూండగా, ''అంత చద్ది అన్నం మూటగట్టి ఇస్తాను. తీసుకు వెళ్ళండి,'' అన్నది భార్య.

రామయ్య భార్య ఇచ్చిన మూట తీసుకుని బయలుదేరి, మధ్యాన్నందాకా నడిచి, ఒక చెట్టుకింద కూర్చుని, మూట విప్పాడు. మూటలో ఉన్నది రంపపు పొట్టు.

పట్టరాని కోపంతో రామయ్య ఇంటికి తిరిగి వచ్చి, భార్యమీద విరుచుకుపడ్డాడు.

''సన్యాసికి బంధాలూ, కోరికలూ ఉండరాదు, నిగ్రహం ఉండాలి,'' అన్నది భార్య. వెంటనే రామయ్య సన్యాసం పుచ్చుకునే ఆలోచన మానుకున్నాడు.



బేతాళ కథలు

# స్వార్థపరుడు!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అర్ధరాత్రివేళ ఎన్నో ఇక్కట్లకోర్చిన తర్వాత, నీ ప్రయత్నం ఫలించినా, నువ్వెవరికోసమైతే ఇన్ని కఠోర శ్రమలకోర్చావో, ఆ వ్యక్తి కేవలం స్వార్థపరుడూ, భోగలాలసుడూ అని తెలుసుకుని నువ్వు నిరాశకు గురయ్యే అవకాశం వుంది. ఇందుకు ఉదాహరణగా, సుఖభోగాలకు అలవాటుపడి స్వార్థపరుడుగా మారిపోయిన



స్పందనదాసు అనే ఒక కవి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

దుర్గాపురం అనే గ్రామంలో స్పందన దాసు అనే ఒక యువకుడుండేవాడు. అతడు చెట్టూ పుట్టా, రాయీ రప్పా, మనిషీ-మృగం - ఒకటేమిటి, దేనిమీదనైనాసరే మళ్ళీమళ్ళీ వినాలనిపించేటంత వీనులవిందుగా గొప్ప కవిత్వం చెప్పేవాడు.

దుర్గాపురంలో పేదా గొప్పా, చిన్నా పెద్దా అనే తేడా లేకుండా ప్రతి ఒక్కడూ స్పందన దాసు కవిత్వాన్ని ఆనందంతో తన్మయు లౌతూ వినేవారు. తృణమో పణమో కానుకగా ఇచ్చేవారు. ఆ కారణంగా అతడికి రోజులు సుఖంగా గడిచిపోతున్నవి. ఇప్పుడతడికి గ్రామంలో పెద్ద ఇల్లు, నాలుగెకరాల పొలం, పదివేల వరహాల నగదు ఉన్నాయి. ఇక పెళ్ళిచేసుకుందామని అతడు ఆలోచిస్తూం డగా, గ్రామానికి పెద్ద కరువొచ్చింది.

ఆ గ్రామ పరిసరప్రాంతాల్లో వరసగా రెండేళ్ళు వానలు లేవు. ఉన్నవాళ్ళు తమ నిల్వధనంతో సుఖంగానే ఉన్నారు. దినదిన గండంగా రోజులు వెళ్ళబుచ్చుతున్న ఏమీ లేని పేదలు గ్రామం వదిలి వలసపోదామను కున్నారు. వాళ్ళను ఒక త్రాటిమీద నడిపించే బాబులు అనేవాడు, దూరంగావున్న కొన్ని ప్రాంతాలు తిరిగివచ్చి, సివంగిపట్నం తమకు అనుకూలంగా వుంటుందని తెలుసుకు న్నాడు. అయితే పేదవాళ్ళెవరూ ఈ వార్త విని సంతోషించలేదు.

''మాకేవూరైనా ఒకటే. కానీ రోజూ కాసే పైనా స్పందనదాసు కవిత్వం వినకుండా వుండలేం. అతణ్ణి కూడా మనతో రావడానికి ఎలాగైనా ఒప్పించు,'' అన్నారు పేదవాళ్ళు, బాబులుతో.

బాబులు, స్పందనదాసును కలుసు కుని సంగతిచెప్పి, ''నువ్వూ మాతోపాటు సివంగిపట్నం వచ్చి వుండు,'' అని కోరాడు.

ఇది విని స్పందనదాసు చలించిపోయి, గ్రామపెద్ద రాజయ్యను కలుసుకున్నాడు. ఆయన విచారంగా, ''మన కష్టాలు గురించి రాజుగారికి ఎంతగానో విన్నవించాను. అయినా చిన్నమెత్తు ప్రయోజనం కలగలేదు. వలస పోయేవాళ్ళను పోనివ్వడమే తప్ప చేయ గలిగిందేమీ లేదు,'' అన్నాడు.

స్పందనదాసు పరిస్థితిని అర్థం చేసు కున్నాడు. అతడు బాబులు వద్దకు వెళ్ళి, ''మీరు మొత్తం రెండు వందల మంది ఉన్నారు. మీ తిండికి రోజుకు మనిషికి వరహా

చెప్పిన రెండు వందల వరహాలవుతుంది. ఆ వ్యయం నేను భరిస్తాను. వలస పోవద్దు, ఇక్కడే వుండండి,'' అని చెప్పాడు.

బాబులు తెల్లబోయి, ''అయ్యా! నీ ధర్మ గుణం గొప్పది. కానీ ఇలా నువ్వు మమ్మల్నెంత కాలం పోషించగలవు?'' అన్నాడు.

''నేను రెండు రోజులపాటు గ్రామం నలు మూలలూ తిరిగి అందరి కష్టాలూ తెలుసు కుని, ఆ కష్టాలమీద కవిత్వం రాస్తాను. మహారాజును కలుసుకుని, ఆ కవిత్వం వినిపిస్తాను. అది విని గుండె కరిగి ఆయన మనకు సాయం చెయ్యకపోతే, నా కవిత్వం వృథా. నేను మళ్ళీ కవిత్వం చెప్పను. గ్రామా నికి తిరిగి రాను,'' అన్నాడు స్పందనదాసు.

ఆ విధంగా స్పందనదాసు రెండు రోజుల పాటు గ్రామమంతా తిరిగాడు. ప్రజల దారుణ పరిస్థితులు కలిగించిన స్పందనతో, అతడి నోట అసువుగా కవిత్వం వెలువడింది. ఎప్పటికప్పుడు అతడు దాన్ని తాళపత్రాల మీద రాసుకున్నాడు. వాటిని తీసుకుని రాజధానికి ప్రయాణమయ్యాడు. ఆ ప్రయా ణంలో అతడు ఎన్నో సుందర దృశ్యాలనూ, హృదయవిదారక విశేషాలనూ చూసి, తనలో వచ్చిన కవితావేశాన్ని తాళపత్రాల మీద పొందు పరిచాడు.

స్పందనదాసు రాజధాని చేరుకున్నాక, అతడు రాజు కొలువుకు వెళ్ళబోతే కాపలా భటులుఅడ్డగించారు. అప్పుడతడు, ''నేను విష్ణుభక్తుణ్ణి. రాజంటే సాక్షాత్తూ మహావిష్ణువు. మీరు జయ విజయుల్లా అడ్డు పడ్డారు. నా శాపం మీకు తగుల్తుంది. రాక్షస జన్మకు సిద్ధమవుతారో, రాజుకు నా గురించి విన్న



విస్తారో–అది మీ ఇష్టం!'' అంటూ ఒక పద్యం చెప్పి హుంకరించాడు.

కాపలా భటులు, స్పందనదాసు గొప్ప తనాన్ని అర్థంచేసుకుని, వెంటనే లోపలకు వెళ్ళి రాజుకు విషయం విన్నవించారు. జరిగిందానికి రాజు అబ్బురపడి, స్పందన దాసును సగౌరవంగా లోపలికి తీసుకు రమ్మన్నాడు.

స్పందనదాసు కొలువులో ప్రవేశించి, తన్నుతానే పరిచయం చేసుకుని, దుర్గాపుర గ్రామస్థుల కష్టాల గురించి తను రాసిన కవిత్వాన్ని వినిపించాడు. అది విన్న రాజుతో పాటు కొలువులోనివారందరూ కంట నీరు పెట్టారు.

కొద్దిసేపు తర్వాత రాజు తేరుకుని, మంత్రి వంక తిరిగి, ''దుర్గాపురానికి తగిన సాయం అందే ఏర్పాట్లు వెంటనే చేయండి,'' అని



ఆజ్ఞాపించాడు. తర్వాత స్పందనదాసుతో, ''కవివర్యా! నీ కవిత్వం మా మనసులను కలచివేసింది. మీ దుర్గాపురానికే కాదు, ఇబ్బందులకు గురైన ప్రతి గ్రామానికీ వెంటనే తగిన సాయం జరిగే ఏర్పాట్లు చేస్తాను,'' అన్నాడు.

ఈ మాటలు వింటూనే స్పందనదాసుకు ఎక్కడలేని ఉత్సాహం కలిగింది. అతడు తన ప్రయాణంలో చూసిన సుందర దృశ్యాలపై కావ్యగానం చేశాడు. రాజధాని వైభోగాన్నీ, రాజు గొప్పతనాన్నీ, ధర్మపాలననూ వర్ణిస్తూ కూడా అతడు కొన్ని పద్యాలు చెప్పగా, కొలువులోవున్న వారందరూ ఉత్సాహభరితులై హర్షధ్వానాలు చేశారు.

రాజు, స్పందనదాసును తన ఆస్థానకవిగా వుండమని కోరాడు. అయితే, అతడు తన గ్రామంవారిని సంప్రదించాలన్నాడు.

ఈలోగా, రాజాస్థానంలో స్పందనదాసుకు జరిగిన గౌరవసత్కారాలను గురించి విన్న బాబులు, దుర్గాపురం నుంచి వచ్చి, రాజును దర్శించి, ''ప్రభూ! స్పందనదాసు కవిత్వం కోసం మా గ్రామ పేదలు పస్తులైనా వుండాలనుకున్నారు. అలాంటివాడిని మాకు దూరం చేయడం తమకు న్యాయం కాదు. స్పందనదాసును దుర్గాపురానికి పెద్దను చెయ్యండి. ఆ విధంగా అతడు మాతోనే వుంటాడు. మా బాగోగులు చూసుకుంటాడు,'' అన్నాడు.

అయితే, స్పందనదాసు, బాబులు మాటలకు ఒప్పుకోక, ''నేను అక్కడ లేనప్పుడూ దుర్గాపురంలోని పౌరులు సుఖంగా, సంతోషంగా వున్నారు. నేను శాశ్వతం కాదు! నన్ను రాజాస్థానంలోనే వుండనివ్వు. అప్పుడప్పుడూ నేను దుర్గాపురం వచ్చి, మీ యోగక్షేమాలు తెలుసుకుని, మీకు నా కవిత్వం వినిపిస్తూ

ఉంటాను. నాకంటే, నా కవిత్వం కంటే మీకు తిండి,బట్ట, నిద్ర ముఖ్యం,'' అని చెప్పి బాబులును పంపేశాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, ''రాజా, దుర్గాపుర గ్రామస్థులు స్పందనదాసు పట్ల ఎంతో ఆప్యాయతా గౌరవాలు కలవాళ్ళు. కఠినమైన కాటక పరిస్థితుల్లోకూడా, అతడూ తమతోపాటు గ్రామం విడిచి వలసకు రాకపోతే, తాము గ్రామం నుంచి కదలమని పట్టుబట్టారు. స్పందనదాసు వాళ్ళ దుర్భర స్థితిని తన కవితా శక్తితో రాజుకు వినిపించి, ఆయన ద్వారా గ్రామానికి మేలు కలిగించాడు; అంతవరకూ బాగానేవున్నది. కానీ, గ్రామప్రజల ప్రతినిధిగా బాబులు వచ్చి, రాజాస్థానకవి పదవిని వదలి తిరిగి స్వగ్రామానికిరావలసిందిగా కోరినప్పుడు, అతడన్న మాటలు కేవలం స్వార్థచింతనతో కూడినవిగా లేవా? స్పందనదాసు ఆస్థాన కవిగా రాజభోగాల కోసం, తను పుట్టి పెరిగిన గ్రామాన్నీ, అక్కడి ప్రజల ప్రేమాదరాలనూ అతి సులువుగా తిరస్కరించినట్టు కనబడడం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సాధారణంగా కవులైనవాళ్ళు, ఊహాలోకాల్లో విహరిస్తూం టారు. వాళ్ళ కవిత్వ ఫలితం విన్నవాళ్ళమీద ఆధారపడి వుంటుంది. స్పందనదాసు కవిత్వం విని అతడి గ్రామస్థులు పరవశించారు. అంతకు మించి జరిగిందేమీ లేదు! అదే కవిత్వాన్ని రాజు విన్నప్పుడు, ఆయన వల్ల స్పందనదాసు గ్రామస్థులకేకాక, రాజ్యంలో కరువు కాటకాలకు గురైన అనేక గ్రామాలవాళ్ళకు మేలు జరిగింది. ఇది తెలుసుకున్నాక స్పందనదాసు, తన కవిత్వంతో తన గ్రామం వాళ్ళను సంతోషపరుస్తూ అక్కడ ఉండి పోవడంకన్న, రాజాస్థానంలో వుండి రాజుకు తన కవిత్వం వినిపిస్తూ, మొత్తం రాజ్య పౌరులందరికీ అంతో ఇంతో మేలు కలిగించవచ్చని భావించాడు. ఆ కారణంవల్లనే, అతడు రాజాస్థానంలో వుండి పోవడానికి నిర్ణయించుకున్నాడు. అంతే గాని స్వార్థం కొద్దీ అక్కడ లభించే రాజభోగాల కోసం మాత్రం కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: జొన్నలగడ్డ రామలక్ష్మి రచన]



# మనదేశం గురించి తెలుసుకుందాం

**- క్విజ్**

మన సంస్కృతిలో ప్రధానమైనవి పురాణ, ఇతిహాసాలు. భారత రామాయణాలు, పురాణ కథలు తెలియనివారంటూ మనదేశంలో ఉండరు. ఈనెల క్విజ్ మన పురాణాలకు సంబంధించినది. మీకు ఈ ప్రశ్నలలో ఎన్నిటికి సరైన సమాధానాలు తెలుసో సరిచూసుకోండి.

1. అన్న పానీయాలు, నిద్ర—విశ్రాంతి లేకుండా కఠోరమైన తపస్సుచేయగల సమర్థులు. వీరి పేరేమిటో తెలుసా?
2. హిమాలయపర్వత రాజకుమారి ఎవరో తెలుసా? పర్వత సంబంధాన్ని సూచించే ఆమెకున్న రెండుపేర్లు చెప్పగలరా?
3. ఋషి అయిన తన భర్తశాపకారణంగా ఆమె శిలగా మారిపోయింది. ఒక అవతారపురుషుడి పాదస్పర్శ తగలడంతో శాపవిముక్తి కలిగి మామూలు మనిషి అయింది. ఈ సంఘటనలోని ముగ్గురి పేర్లు ఏమిటో చెప్పగలరా?
4. దేవదానవులు అమృతం కోసం పాలసముద్రాన్ని మథించినప్పుడు దానినుంచి ఎన్నో వెలువడ్డాయి. వాటిలో తెల్ల ఏనుగు ముఖ్యమైనది. దానిని ఇంద్రుడు తన వాహనంగా స్వీకరించాడు. ఆ ఏనుగు పేరేమిటో తెలుసా?
5. కృష్ణుడి మేనమామ కంసుడి తండ్రి పేరేమిటో తెలుసా?
6. నలచక్రవర్తి మంటల నుంచి ఒక నాగుణ్ణి కాపాడాడు. ఆ నాగసర్పం పేరేమిటి?
7. తన భర్తపుట్టుకతో అంధుడు కావడం వల్ల తన కళ్ళకు కూడా గంతలు కట్టుకుని తనుకూడా ప్రపంచాన్ని చూడడం మానివేసిన మహిళ ఎవరు?
8. సీతారామలక్ష్మణులు ఈ అరణ్యంలో వనవాసం చేస్తున్నప్పుడే రావణుడు సీతను అపహరించాడు. ఆ అరణ్యం పేరేమిటి?

(సమాధానాలు వచ్చే సంచికలో)

**ఫిబ్రవరి క్విజ్ సమాధానాలు:**

1. అరుణాచలప్రదేశ్.
2. మధ్యప్రదేశ్.
3. మణిపూర్.
4. 'విహారస్' అనే పదం నుంచి బీహార్.
5. సిమ్లా, హిమాచలప్రదేశ్.
6. కేరళ.
7. చండీఘడ్-పంజాబ్-హర్యానా.
8. ఉత్తరప్రదేశ్-హరిద్వార్,

# భారత సంస్కృతి-చరిత్ర

ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

## 26. మారిన తలలు!



సందీపుడు, శ్యామల, వాళ్ళ మిత్రులు ఇంకా విక్రమాదిత్యుణ్ణి గురించిన ఆలోచనల నుంచి బయటపడలేదు. మరుసటి వారం కలుసుకున్నప్పుడు కూడా ఆ రాజును గురించిన ప్రస్తావన వచ్చింది. "ఎంతటి ధైర్యశాలి ఆ రాజు!" అంటూ ముక్కున వేలేసుకుంది శ్యామల.

"ధైర్యశాలి మాత్రమేకాదు. తన ఆస్థానంలో కాళిదాసు వంటి తొమ్మిదిమంది మేధావుల్ని పోషించాడంటే ఆయన కూడా తప్పక గొప్ప మేధావి అయి వుండాలి!" అన్నది శ్యామల స్నేహితురాలు డాలీ.

"గత ఆదివారం నేను చెప్పిన విషయాలను అంతలోనే మరిచిపోయావా, తల్లీ!" అంటూ నవ్విన దేవనాధుడు మళ్ళీ ఇలా అన్నాడు: "నవరత్నాలనే ఆ తొమ్మిదిమంది మేధావులూ సమకాలంలో జీవించారని మన చరిత్రకారులు విశ్వసించడం లేదు. అయితే, ప్రజలు మాత్రం విక్రమాదిత్యుణ్ణి అసమాన ధైర్యసాహసాలు గల అద్భుతమేధావిగా తరతరాలుగా చెప్పుకుంటున్నారు. అలాంటి అసమాన పండితులను మరెవ్వరు పోషించగలరు చెప్పండి?"

"తాతయ్యా! క్రీ.శ. ఒకటవ శతాబ్దంలో విక్రమాదిత్యుడనే గొప్ప రాజు ఉండేవాడు అన్న సంగతి చరిత్ర చెబుతున్నది కదా?" అన్నాడు సందీపుడు.

"అవును. ఆయన అపురూప పరాక్రమశాలి అయిన గొప్ప రాజే అయివుండాలి, అని అప్పుడే చెప్పానుకదా! ఆయన పేరు మీదుగానే విక్రమ



త్మక ప్రశ్నలకు ఆయన ఇచ్చిన సమాధానాలు అరుదైన ఆయన మేధాసంపత్తికీ తార్కాణాలుగా భాసిస్తున్నాయి. విక్రమార్కుడి సమాధానాలు ధర్మసూక్ష్మ దర్శనాలు!'' అన్నాడు దేవనాథుడు.

''ఉదాహరణకు ఒకటి?'' అన్నది డాలీ.

''బేతాళ పంచవింశతి అనే ఇరవై అయిదు బేతాళకథలు మీరు చదివారు కదా?'' అని అడిగాడు దేవనాథుడు.

''లేదు!'' అన్నట్టు తల అడ్డంగా ఊపింది డాలీ.

సందీపుడికీ, శ్యామలకూ తప్ప తక్కిన వారికి వాటిని గురించి తెలియదని తేలింది. అందరూ దేవనాథుణ్ణి బేతాళకథ ఒకటి చెప్పమని పట్టుబట్టారు.

''విజ్ఞానశాస్త్రం ఎంతగానో అభివృద్ధి సాధించిన ఈనాటికీ ఉపయోగపడే బేతాళకథ ఒకటి చెబుతాను, వినండి,'' అంటూ దేవనాథుడు ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు ధవళుడనే యువకుడొకడు ఉండేవాడు. వాడు బాల్యంలో ఒకానొక ముని ప్రభావానికిలోనై తానూ గొప్ప ముని కావాలని కలలు కనసాగాడు. ప్రాపంచిక బంధాలన్నిటినీ తెంచుకుని బయటపడి సన్యాసజీవితం గడపాలని కోరుకునేవాడు.

అయితే, అతడు పెరిగి యుక్తవయస్కుడయ్యేసరికి, అతన్ని పెళ్ళిచేసుకోమని తల్లితండ్రులు బలవంతపెట్టారు. అతడు సుగుణవతి అయిన ఒక యువతిని పెళ్ళాడి సుఖంగా కాలం గడపసాగాడు.

ఒకనాడు ధవళుడి బావమరిది వచ్చి తమ ఊళ్ళో తిరణాల జరుగుతున్నదని, అందుకు చెల్లెల్నీ, బావనూ రమ్మని పిలిచాడు. ధవళుడు భార్యతో కలిసి అతని వెంట బయలు దేరాడు. మార్గమధ్యంలో చిన్న అడవిని దాటవలసి వచ్చింది. కొంతదూరం నడిచాక ధవళుడి భార్య బాగా అలిసిపోయింది. విశ్రాంతి కోసం ముగ్గురూ ఒక చెట్టు నీడన కూర్చున్నారు.

శకం ఆరంభమయింది. విక్రమశకం ప్రకారం కాలాన్ని గణించేవాళ్ళు ఈనాటికీ మనదేశంలో పలువురున్నారు,'' అన్నాడు దేవనాథుడు.

''అదిసరే, ఆయన చుట్టూ బేతాళ కథలను ఎవరుసృష్టించారు తాతయ్యా?'' అని అడిగింది డాలీ చిన్నగా నవ్వుతూ.

''అది నాకు తెలియదు. ఇతర చరిత్రకారులకు తెలిసివుంటుందని కూడా అనుకోను. విక్రమార్కుడు సమయస్ఫూర్తికీ, వాక్చాతుర్యానికీ, మేధాసంపత్తికీ పేరుగాంచిన రాజై ఉండాలి. ఆయన క్లిష్టసమస్యలను ఇట్టే పరిష్కరించేనేర్పరి అయిఉండాలి. సూక్ష్మమైన ధర్మాలను గ్రహించి ఆయన ఇచ్చే తీర్పులను విని ఆయన సమకాలికులు అబ్బురపడి ఉండాలి. మానవుల సమస్యలనేకాకుండా బేతాళుడి వంటి మానవాతీత శక్తుల సమస్యలను కూడా పరిష్కరించగల సమర్థుడైన రాజుగా ఆయన్ను ఊహించుకుని ఉంటారు. బేతాళుడి పట్ల ఆయన వ్యవహరించినతీరు ఆయన ధైర్యానికీ, బేతాళుడి సమస్యా

అప్పుడు ధవళుడు దాపులనున్న ఒక శిథిలాలయాన్ని గమనించాడు. ఆతురతకొద్దీ లేచి ఆలయం లోపలికి వెళ్ళాడు. బ్రహ్మాండమైన దేవీ విగ్రహంతో గర్భగృహంలోని గంభీర వాతావరణం భయంకరంగా కనిపించింది. ధవళుడికి హఠాత్తుగా సన్యాసి కావాలని తాను బాల్యంలో తీసుకున్న నిర్ణయం గుర్తుకువచ్చింది. దాంతోపాటు ఒక విధమైన పశ్చాత్తాపం అతడి మనసును పిండినట్టయింది. మానవజన్మ ఎత్తి దేవుడిపట్ల దృష్టి సారించకుండా, అతిసాధారణమైన జీవితం గడపడం వల్ల ఒరిగే ప్రయోజనం ఏమిటి? అన్న వైరాగ్యభావంతో, దేవీవిగ్రహం చేతిలోని ఖడ్గాన్ని లాక్కుని, ఒక్క వేటుతో తన తలను తెగనరుక్కున్నాడు!

ఆలయం లోపలికి వెళ్ళిన బావ ఎంతకూ తిరిగి రాలేదేమిటా అని అతని బావమరిది లేచి ఆలయంలోకి వెళ్ళాడు. అక్కడి దృశ్యాన్ని చూసి దిగ్భ్రాంతిచెందాడు. ఈ దారుణాన్ని చెల్లెలికి ఎలా చెప్పను? ఆమె ముఖం ఎలా చూడను? అనుకుంటూ భరించరాని విషాదంతో ధవళుడిలాగే ఖడ్గం అందుకుని తన తలను కూడా తెగనరుక్కున్నాడు!

గుడిలోపలికి వెళ్ళిన అన్నకూడా ఎంతసేపటికీ రాకపోయేసరికి, ఏం జరిగిందో చూద్దామని ధవళుడి భార్య లేచి, గుడిలోకి వెళ్ళింది. అక్కడి దృశ్యాన్ని చూసి తట్టుకోలేకపోయింది. భర్తా, సోదరుడూ తలలు తెగి నెత్తుటి మడుగులో పడివున్న భీకరదృశ్యం చూసి, నిలబడలేకపోయింది. కిందపడివున్న ఖడ్గాన్ని అందుకుని తనుకూడా తల నరుక్కోవడానికి పైకెత్తింది. అంతలో మెరుపు మెరిసినట్టయింది. ''ఆగు!'' అన్నమాట వినిపించడంతో తల పైకెత్తి చూసింది.

''ప్రపంచాన్ని త్యజిస్తే తప్ప ఆధ్యాత్మిక జీవితం సాగించలేననుకున్న మూర్ఖుడు నీ భర్త! దుఃఖావేశంతో నీ భర్తను అనుసరించిన నీ సోదరుడుకూడా మూర్ఖుడే! తొందరపడి నువ్వుకూడా



ఆ బుద్ధిమాలిన పనికి పూనుకోవద్దు!'' అన్న గంభీరమైన మాటలు దేవీ విగ్రహం నుంచి వినిపించాయి.

''తల్లీ! వాళ్ళిద్దరూ లేకుండా నేనెలా బతకను? ఎక్కడికి వెళ్ళను?'' అని అడిగింది ఆ యువతి.

''నీకా విచారం వద్దు. వాళ్ళ శరీరాలకు తెగిపడిన శిరస్సులను చేర్చిపెట్టి, నా పాదాల వద్దవున్న కలశంలోని జలాన్ని చల్లు. వాళ్ళు మళ్ళీ సజీవులవుతారు!'' అన్నది దేవీవాక్కు.

ఆ యువతి దేవి చెప్పినట్టే చేసింది. ఇద్దరూ గాఢనిద్రనుంచి లేచినట్టు, లేచికూర్చుని, ''లోపలికి రాగానే ఎలానిద్రపోయామో, ఏమో!''అన్నారు.

ఆమె మరేదీమాట్లాడకుండా ఆలయం నుంచి వెలుపలికి వచ్చింది. ముగ్గురూ మళ్ళీ ప్రయాణం సాగించారు. కొంతదూరం నడిచి వెళ్ళాక ఆ యువతి తాను చేసిన దారుణమైన పొరబాటు గ్రహించి పిడుగుపాటుకు గురైన దానిలా ఒక్క క్షణం అలాగే నిలబడిపోయింది.

చీకటిగా ఉన్న దేవీ గర్భగృహంలో, భర్త శరీరానికి సోదరుడి తలా, సోదరుడి శరీరానికి భర్త తలా అతికించింది!

బేతాళుడు రాజుకు ఈ కథ చెప్పి, "రాజా! ఆ యువతి ఎవరిని భర్తగా స్వీకరించాలి? భర్త తలా-సోదరుడి శరీరమూ కలిగినవాణ్ణి భర్తగా స్వీకరించాలా? లేక సోదరుడి తలా భర్త శరీరమూ కలిగినవాణ్ణి భర్తగా స్వీకరించాలా?" అని ప్రశ్నించాడు.

దానికి రాజు, "అంగాలన్నిటిలోకీ ప్రధానమైనది శిరస్సు. అదే వ్యక్తి స్వభావాన్ని నిర్ణయిస్తుంది. అందువల్ల భర్త శిరస్సుగల వ్యక్తినే ఆ యువతి భర్తగా స్వీకరించాలి," అని సమాధానమిచ్చాడు.

"ఆసక్తికరమైన వింత కథ!" అన్నారు పిల్లలందరూ ముక్తకంఠంతో, దేవనాధుడు కథ పూర్తిచేయగానే.

"నిజమే. చాలా విచిత్రమైన కథ. ఈ కథలో మరొక ఆసక్తికరమైన విశేషం కూడా ఉంది గమనించారా? ఆ సంగతి మీకు మొదటే చెప్పాను. మన వర్తమానకాలానికి సైతం ఉపయోగపడే అంశం ఒకటి ఇందులో ఉంది. అదేమిటో చెప్పగలరా?" అని అడిగాడు దేవనాధుడు.

పిల్లలు సమాధానం చెప్పకుండా ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు. అప్పుడు సందీపుడు, "తాతయ్యా! కొన్ని నెలల క్రితం మరణించిన డా. క్రిస్టియన్ బెర్నార్డ్‌తో సంబంధం ఉన్న విశేషమే కదా?" అన్నాడు.

"అవును. సరిగ్గా చెప్పావు. దాదాపు నాలుగు దశాబ్దాలకు పూర్వం డా. బెర్నార్డ్ గుండె మార్పిడి శస్త్రచికిత్స, అంటే - ఒక మనిషి గుండెను వేరొక మనిషికి మార్చి అమర్చిన అద్భుతం సృష్టించాడు. ఆ సంఘటన మేధావులమధ్య - మునుముందు శిరస్సుమార్పిడి కూడా సాధ్యమవుతుందా? ఒకవేళ సాధ్యమైతే ఆ వ్యక్తిని ఎవరుగా గుర్తించాలి? శిరస్సును పొందిన వ్యక్తిగానా? శరీరాన్ని పొందిన వ్యక్తిగానా? మొదలైన చర్చలకు దారితీసింది. అయినా, ఆ సమస్యకు విక్రమార్కుడు ఎప్పుడో చక్కటి పరిష్కారం చూపినట్టూ, నిర్ద్వంద్వమైన సమాధానం ఇచ్చినట్టూ గ్రహించారుకదా?" అన్నాడు దేవనాధుడు.

"అవును, తాతయ్యా! విస్పష్టమైన సమాధానంఇచ్చాడు," అన్నారు పిల్లలు పట్టరాని ఆశ్చర్యానందాలతో. - (ఇంకావుంది)



## ఛత్రపతి గుడి!

సాహసకార్యాలను చేసి చరిత్ర సృష్టించిన వీరులను గురించి కథలు కథలుగా చెప్పు కుంటారు. అది వ్యక్తిపూజకు కూడా దారితీస్తుంది. మహా రాష్ట్రం కొంకణ తీరంలోని సింధు దుర్గ్‌లో మరాఠా వీరుడు ఛత్రపతి శివాజీ గుడి ఉంది. గుడిలో లోహపు తొడు గుతో ఉన్న రాతి విగ్రహం ప్రతిష్ఠించబడి ఉంది. ఈ విగ్రహానికి పూజలు చేస్తారు. విగ్రహం చేతిలో ఉన్న ఖడ్గం ఆ మరాఠా వీరుడు ఉపయో గించిన ఖడ్గాలలో ఒకటి అని చెబుతారు! శివాజీ కొలు వులో పనిచేసినవారి సంత తికి చెందిన చాలా కుటుం బాలు సింధుదుర్గ్‌లో ఇంకా ఉన్నాయి.



## అక్బర్ రహస్యం!

అక్బర్ చర్మ సౌందర్యానికి కారణం ఏమిటో తెలుసా? మహారాష్ట్రలోని ఔరంగా బాద్‌కు సమీప 'లొనార్' తటాకం నుంచి తెచ్చిన జలంతో తయారుచేసిన సబ్బునే ఆయన వాడేవాడని



'అక్బర్‌నామా' తెలియజే స్తోంది. ఇక్కడి భూమిలోని ఖనిజసంపదల కారణంగా ఆ జలాలకు విశిష్ట ఔషధ గుణాలు ఉన్నాయని చెబు తారు. లక్షలాది సంవత్సరాల క్రితం పెద్ద ఉల్కాపాతంవల్ల బ్రహ్మాండమైన బిలం ఏర్ప డింది. అదే కొన్నాళ్ళకు తటా కంగా మారింది. ఇప్పుడు ఆ తటాకంలోని జలం క్షార మయమై పోవడం వల్ల చాలా ప్రాణులకు ఉపయోగ కరంగా లేదు.

## తోడా స్త్రీలు

చల్లటి గాలులు వీచే నీలగిరి కొండ సానువులలో తోడా కొండజాతి ప్రజలు నివసిస్తు న్నారు. ముంగ్స్ అనే చిన్నచిన్న గ్రామాలలో నివసించే వీళ్ళు ఎక్కువగా జీవనోపాధికి అడ వులనే నమ్ముకుని ఉన్నారు. వీళ్ళకు సామూహికంగా కొన్ని కట్టుబాట్లు ఉన్నాయి.



వాటిని అతి కఠినంగా పాటి స్తారు. ఉదాహరణకు తోడా స్త్రీలు దేవాలయాలలో ప్రవే శించకూడదు అనే నియమం ఉంది. ఆలయానికి కొంత దూరంలోనే సంప్రదాయా నుసారం ఒక అడ్డంకును ఏర్పరుస్తారు. ఆ చోటును దాటుకుని స్త్రీలు అవతలికి వెళ్ళకూడదు. ఇంతకూ తోడాలు ఎవర్ని కొలుస్తారో తెలుసా? 'టికాయ్' అనే దేవతను!

## రాజమహల్లో హోలీ!

మీరే రాజకుమారులయితే, రాజభవనం లోపలే హోలీ వేడుకలలో పాల్గొని భవనం గోడలనూ, నేలనూ మురికి చేయరుకదా? భవనం నుంచి వెలుపలికి వచ్చి బంధు మిత్రుల మీద రంగునీళ్ళు చల్లుతారు! అంతే కదా! సరిగ్గా అదేరీతిలోనే జైపూర్ రాజులు, రాణులు సంప్రదాయానుసారం హోలీ వేడుకులు జరుపుకునేవారు.

మనకు లభిస్తూన్న చారిత్రక ఆధారాలను బట్టి పరిశీలించినట్టయితే, రాజులు ఏనుగు మీద ఎక్కి హవా మహల్ వంటి భవనాల



ముందుకు వచ్చేవారు. వాళ్ళ చుట్టూ ఉన్న సేవకులు రంగు నీళ్ళూ, రకరకాల రంగుల పొడులూ తీసుకువచ్చేవారు. రాజులు వాటిని భవనాలలో గవాక్షాల వద్ద నిలబడిన రాణుల మీదికీ, యువ రాణుల మీదికీ చల్లేవారు. అందంగా అలంకరించు కున్న రాణులూ, యువ రాణులూ కూడా వీళ్ళ మీదికి ఆనందోత్సాహాలతో పైనుంచి రంగు నీళ్ళను పిచికారీ చేసేవారు!

## యుబీ లక్పీ!

ఒక కొబ్బరికాయ కోసం పధ్నాలుగుమంది పోటీపడు తూంటే దానిని చూసి మీరే మనుకుంటారు? దాని వెనక అలా పరిగెత్తుతున్నారు, దాని ప్రత్యేకత ఏమిటా అని ఆశ్చ ర్యపోతారు కదూ! అది ఒక ఆట. దానిపేరు యుబీ లక్పీ. మణిపురి కుర్రకారు మధ్య ఈ కొబ్బరికాయ ఆట చాలా ప్రసిద్ధమైనది. దీనిని పదీ, పధ్నాలుగుమంది కుర్రవాళ్ళు కలిసి ఆడుతారన్నమాట.

దీర్ఘ చతురస్రాకార మైదా నంలో యుబీ లక్పీని ఆడు తారు. ఈ మైదానం చివర ఒక వైపున గుండ్రంగా ఒక గీత గీస్తారు. బాగా నూనెపట్టించిన కొబ్బరికాయను ఈ ఆటలో బంతిగా వాడతారు. దానిని ఒక చివర నుంచి నేలమీద దొర్లిస్తారు. ఆ కొబ్బరి 'బంతిని' మరోచివర గీసిన గీత లోప లికి చేర్చాలి. కొబ్బరికాయను సాధించగల ఆటగాడు దానిని వక్షానికి అదుముకుని గిరి లోపలికి ప్రవేశించాలి. అప్పుడే అతడ్ని విజేతగా ప్రకటిస్తారు. ఈ ఆటలాడేప్పుడు కోపతా పాలు ఎక్కువై ఒకరినొకరు కిందా మీదా తోసుకున్నప్పుడు



వాళ్ళను విడదీయడానికి వాళ్ళమీద మంచినీళ్ళు కుమ్మరిస్తారు!

యుబీలక్పీ ఎవరైనా ఆడ వచ్చుగదా! ఏమంటారు?



# హాస్యచతురులు: గోపాల్ భాండ్



గోపాల్ భాండ్ తన తండ్రి తొలి సంవత్సరీకం జరిపించడానికి పురోహితుడు ఉన్నచోటికి పడవలో చాలాదూరం వెళ్ళవలసి వచ్చింది. ''శుభఘడియలు దాటిపోకముందే కర్మకాండ పూర్తిచేయాలి. పడవను త్వరగా నడిపించు,'' అంటూ పడవవాణ్ణి తొందరపెట్టసాగాడు.

కొంతసేపటికి నది దాటి,పురోహితుడు ఉన్న చోటికి చేరుకున్నాడు గోపాల్ భాండ్. మంత్రాలు వల్లిస్తూ, ఉన్నట్టుండి మధ్యలో ఆపి, ''నాయనా! నీ తండ్రి నాకు వందరూపాయలు ఇవ్వాలి. ఆ మొత్తాన్ని ఇప్పుడే చెల్లించు. లేకుంటే ఈ కర్మ కాండ పూర్తిచేయను,'' అన్నాడు పురోహితుడు.



గోపాల్ ఆ మాటకు ఉలిక్కిపడి, అంతలోనే తేరుకుని, శుభఘడియలు దాటకముందే కర్మకాండను పూర్తిచేయాలనుకున్న నిర్ణయంతో, ''రేపు తెల్లవారేసరికి మీ పైకం మీ గుమ్మం ముందు ఉండేలా చూస్తాను. దయచేసి ఇప్పుడీ కర్మకాండను పూర్తిచేయండి స్వామీ!'' అని వేడుకున్నాడు.

అనుకున్నవిధంగా కర్మకాండ పూర్తయింది. ఇక పురోహితుడికిచ్చిన మాట నిలుపుకోవాలి కదాఅని ఆలోచిస్తూ గోపాల్ అక్కడినుంచి బయలు దేరాడు. అది పనసపళ్ళకాలం. ప్రతి ఇంటి పెరట్లోనూ తొనలు తినిపారేసిన పనసగింజలు కావలసినన్ని ఉన్నాయి. గోపాల్ ఒక సంచీ తీసుకుని వాటినన్నిటినీ సేకరించుకున్నాడు.





బాగా రాత్రయ్యాక, గోపాల్ ఆ విత్తనాల మూటను తీసుకుని పురోహితుడి ఇంటి దగ్గరికి వెళ్ళాడు. ఇంటి గుమ్మం ముందు వరసలు వరసలుగా గుంటలు తవ్వి గింజలను పాతిపెట్టి, పురోహితుడు ఎప్పుడు వస్తాడా అని కాచుకుని కూర్చున్నాడు.



తెల్లవారుతూండగా పురోహితుడు తలుపు తెరుచుకుని బయటకు వచ్చాడు. విత్తనాలు పాతినచోట గోపాల్ నేలను చదును చేస్తున్నాడు. నిద్రమత్తులో కళ్ళు నలుపుకుంటూ, "ఇక్కడేం చేస్తున్నావు గోపాల్?" అని అడిగాడు పురోహితుడు.



"చనిపోయిన నా తండ్రి తమవద్ద పుచ్చుకున్న డబ్బును తిరిగి చెల్లిస్తానని మాట ఇచ్చాను కదా?" అన్నాడు గోపాల్. అవును అన్నట్టు తల ఊపాడు పురోహితుడు. "దానిని నెరవేర్చాను. కావలసినన్ని పనసగింజలను మీ వాకిట్లో పాతాను. ఇకపై మీకు పళ్ళే పళ్ళు!" అన్నాడు గోపాల్.



"పనసగింజలు డబ్బులుకావు కదా గోపాల్!" అన్నాడు పురోహితుడు. "గింజలు మొలకెత్తి, చెట్లయితే మీకు కావలసినన్ని పళ్ళనిస్తాయి. వాటిని అమ్ముకుంటే బోలెడు డబ్బులు!" అని గోపాల్‌భాండ్ కొంతసేపు ఆగి, "డబ్బు మీ గుమ్మం ముందు ఉండేలా చేస్తానని మీకు మాట ఇచ్చాను కదా? ఇప్పుడు చేశాను," అంటూ పురోహితుడు ఆశ్చర్యం నుంచి తేరుకోకముందే అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

# హోలీ

శీతాకాలం ముగిసి వసంతకాలం ఆరంభమయ్యే సమయంలో రంగులపండుగ హోలీ వస్తుంది. ఫాల్గుణమాసం పౌర్ణమిరోజు ఈ పండుగజరుపుకుంటారు. అంటేమార్చ్‌నెలలో వస్తుందన్నమాట.

శీతాకాలం అంతమయ్యేసరికి పంటల నూర్పిళ్ళు కూడా పూర్తవుతాయి. చెట్లన్నీ పచ్చ పచ్చగా ఒక్కసారిగా చిగురిస్తాయి. ఆట పాటలతో, ఆనందంగా గడపడానికి అనువైన సమయం. మనదేశంలో రంగులతో నిండిన సందడి పండుగగా మూడు రోజులు జరుపుకునే హోలీని చెప్పుకుంటారు.



ఈ పండుగ సందర్భంగా ఒకరిపై ఒకరు పిచికారీతో రంగులనీళ్ళు చల్లుకుంటారు. రంగునీళ్ళు నింపిన బెలూన్‌లు ఒకరిపై ఒకరు విసురుకుంటారు. ఆట పాటలలో పాల్గొనడంతో పాటు, బంధుమిత్రులకు తినుబండారాలు పంచడం కూడా ఈ పండుగ నాడు చేస్తారు. ఈ రోజు ప్రత్యేకంగా 'గుజ్జా' తయారుచేస్తారు. పెద్దలు 'భంగ్' అనే సంప్రదాయ పానీయం తాగుతారు. ఉత్తర భారతదేశమంతటా హోలీ పండుగను ఘనంగా జరుపుకుంటారు. హోలీకి ముందు రోజు రాలిన ఎండుటాకులనూ, ఎండిన రెమ్మలనూ, కొమ్మలనూ సేకరించి పెద్దమంట వేస్తారు.

ఇతర పండుగలలాగే ఈ పండుగ కూడా చెడుమీద మంచి సాధించిన విజయానికి సంకేతంగా ఏర్పడిందని చెబుతారు. దీనికి సంబంధించిన పురాణ కథలు కూడా అనేకం ఉన్నాయి:

వ్రేపల్లెలో నందుడి ఇంట శిశువుగా ఉన్న కృష్ణుణ్ణి చంపడానికి, కంసుడు పూతన అనే రాక్షసిని పంపాడు. పూతన అందమైన స్త్రీగా మారి నందుడి ఇంటికి వెళ్ళింది. కృష్ణుడికి విషపూరితమైన పాలిచ్చి చంపాలనే ఉద్దేశంతో బిడ్డనెత్తుకుని పాలిచ్చింది. అయితే, శిశువుగా ఉన్న కృష్ణుడు పాలతోపాటు పూతన ప్రాణాలనే

సుప్రసిద్ధమైన ఉదంతం హోళిక కథ. రాక్షస రాజు హిరణ్యకశిపుడి చెల్లెలు హోళిక. విష్ణు భక్తుడైన కొడుకు ప్రహ్లాదుణ్ణి చంపించడానికి హిరణ్యకశిపుడు రకరకాలుగా ప్రయత్నించి విఫలుడయ్యాడు.

మంటలు తట్టుకునే విచిత్రమైన శక్తి హోళికకుఉండేది. ప్రహ్లాదుణ్ణిమంటలపాలు చేయడానికి హిరణ్యకశిపుడు హోళికను నియోగించాడు. ప్రహ్లాదుణ్ణి ఒడిలో కూర్చోబెట్టుకుని హోళిక మంటలలోకి ప్రవేశించింది. అయితే ఆ మంటలు హోళికను భస్మంచేశాయేగాని ప్రహ్లాదుణ్ణి ఏమీచేయలేదు. ఆవిధంగా హోలీ పండుగను చెడుమీద మంచి సాధించిన విజయానికి సంకేతంగా ఏర్పడినట్టుచెబుతారు.



పీల్చేశాడు. హోలీకి సంబంధించిన పురాణ కథలలో ఇది కూడా ఒకటి. అందుకే హోలీకి ముందురోజు వేసే పెద్దమంటలో, పూతన దిష్టిబొమ్మనుకూడా తగలబెడతారు. శ్రీకృష్ణుడి జన్మస్థానంగా చెప్పబడే మధురలో ఈనాటికీ ఈ సంప్రదాయం కొనసాగుతున్నది!

హోలీ సందర్భంగా మధురలో జరిగే మరొక ముఖ్యమైన ఆకర్షణ మట్టికుండ (మట్కా) ను పగలగొట్టడం. బాలకృష్ణుడు నవనీతచోరుడని ప్రసిద్ధి. తోటి పిల్లలతో కలిసి గోపకుల ఇళ్ళల్లోకి జొరబడి ఉట్టిమీది వెన్న దొంగిలించేవాడట. కుండలను పగుల గొట్టేవాడట. దానికి గుర్తుగా 'ఉట్లు' కొట్టే వేడుక చేస్తారు.

శ్రీకృష్ణుడు వసంతకాలంలో గోపికలతో సాగించిన రాసక్రీడలకు సంకేతంగానూ హోలీ వేడుకలను చెబుతారు.

హోలీ పండుగతో సంబంధం ఉన్న మరొక

## హోలీ కొన్ని జాగ్రత్తలు!

- ✓ రంగులతో ఆడుకునేప్పుడు పాత బట్టలు ధరించండి.
- ✓ రంగుల పొడులు కళ్ళల్లో పడకుండా జాగ్రత్త వహించండి.
- ✓ కళ్ళల్లో ఏవైనా పొడులు పడినట్టయితే వెంటనే కడిగేసుకోండి.
- ✓ రంగులతో ఆట పాటలు అయ్యాక శుభ్రంగా స్నానం చేయండి.
- ✓ నమ్మకమైన అంగళ్ళ నుంచి నాణ్యమైన రంగుల పొడులనే కొనండి.
- ✓ రంగునీళ్ళతో నింపిన బెలూన్లతో ఆడుకోకండి.

# జెంషెడ్‌జీ నవ్‌రోజ్

ఫాల్సీ క్యాలండర్‌ను అనుసరించే పార్సీలలో ఒక విభాగం వారికి కొత్తసంవత్సరం వసంతారంభంతో మొదలవుతుంది.

వసంత ఆగమనాన్ని సూచించే దీనిని మార్చ్ 21న జరుపుకుంటారు. నవ్‌రోజ్ అంటే కొత్త రోజు అని అర్థం!

పర్షియన్ క్యాలండర్‌ను క్రమబద్ధంచేసి అందులోకి సౌరమానాన్ని ప్రవేశపెట్టిన సుప్రసిద్ధ పర్షియన్ రాజు జమ్‌షెడ్ కాలం నుంచి ఈ రోజును జరుపుకుంటున్నారు. సూర్యుడు మేషరాశిలోకి ప్రవేశించడాన్ని నూతన సంవత్సరారంభంగా నిర్ణయించారు. దీనినే 'నవ్‌రోజ్' అనీ, 'జెంషెడ్‌జీ నవ్‌రోజ్' అనీ అంటారు. ఈ సందర్భంగా రాజును బంగారం, వెండితో తులాభారంచేసి దానిని ఆ తరువాత పేదసాదలకు పంచిపెట్టే ఆసక్తికరమైన ఆచారం వాడుకలో ఉండేది.

పండుగరోజులలో పార్సీలు నూతన వస్త్రాలు ధరించి, దేవాలయాలను దర్శిస్తారు. 'బాన్స్' అనే



సామాజిక కేంద్రాలకు వెళతారు. బంధుమిత్రులను కలుసుకుంటారు. విందుభోజనాలు చేస్తారు. దానధర్మాలు చేయడం పార్సీలు ప్రధాన ధర్మంగా భావిస్తారు. పండుగ సందర్భాలలో మరింత దయాగుణం కలవారుగా ఉండాలని ఆశిస్తారు!

# గుడ్ ఫ్రైడే

'ఈస్టర్‌డే'కు ముందు శుక్రవారంనాడు ఏసుక్రీస్తును శిలువ చేశారని 'గాస్పెల్' పేర్కొంటున్నది. అందువల్ల ఈ శుక్రవారాన్ని 'గుడ్‌ఫ్రైడే'గా శిలువచేసినందుకు జ్ఞాపకంగా 'సంతాపదినం'గా జరుపుకుంటారు.

ఆరోజు మధ్యాహ్నం మూడు గంటలకు ఏసుక్రీస్తు శిలువమీద మరణించినట్టు విశ్వసిస్తారు. శిలువనుంచి ఏసుక్రీస్తు భౌతిక కాయాన్ని తొలగించే కార్యాన్ని కేథలిక్‌చర్చ్‌లలో



ఆ సమయంలో జరుపుతారు. ఆరోజు చర్చ్‌లలో గంటలు మోగించరు.

కొన్ని చర్చ్‌లలో నల్లటి బట్టలు ధరించి, ఏసుక్రీస్తు విగ్రహాన్ని ఊరేగింపుగా తీసుకుపోయి భక్తిశ్రద్ధలతో పాతిపెడతారు. గుడ్ ఫ్రైడే నాడు క్రైస్తవులందరూ ఉపవాసం ఉంటారు.



# మొహరం



ముస్లిం మొదటి నెల మోహరం పదవ రోజున మోహరం పాటిస్తారు. ప్రవక్తమహమ్మద్ మన వడు హుస్సేన్ తమ మతంకోసం ప్రాణ త్యాగు చేసినరోజుకుస్మృతిగా దీనిని పాటిస్తారు. ఈ రోజును సంతాప దినంగా అనుసరిస్తారు.

ప్రవక్తమహమ్మద్ మరణానంతరం మతాను యాయుల దళనాయకుడు 'ఖలీఫా' పదవికి వారసుణ్ణి ఎంపిక చేయవలసివచ్చింది. మహ మ్మదుకు మగ సంతానం లేదు. ఆయన తనకు వారసుడిగా ఎవరినీ సూచించలేదు. ఆయన ఏకైక కుమార్తె ఫాతిమా, అలీని వివాహమాడింది. వారికి హసన్, హుస్సేన్ అని ఇద్దరు కొడుకులు.

ప్రవక్త అనంతరం ముగ్గురు ఖలీఫాలు వారసులుగా వచ్చాక, అలీని నాలగవఖలీఫాగా ఎన్నుకున్నారు. ఈ ఎంపికను పలువురు వ్యతిరేకించారు. అలీ హతమార్చబడ్డాడు. ఆయన కొడుకు హసన్ ఆ పదవికి వచ్చాడు. అలీ రెండవ కొడుకు హుస్సేన్ మొహరం పదవరోజు 'కర్బేలా' యుద్ధంలో దారుణమైన పరిస్థితులలో మరణానికి గురయ్యాడు.

ముస్లింలు మొహరం సందర్భంగా ఊరే గింపులు జరుపుతారు. ఊరేగింపులో భాగంగా తజియాలనే హుస్సేన్‌గోరీ నమూ నాలను, హస్తాలను తీసుకువెళతారు. ఊరే గింపులో జనం గట్టిగా రోదిస్తూ రొమ్ములు బాదుకుంటూ తమ విషాదాన్ని చాటుతారు. ఊరేగింపు చివర 'తజియాల'ను సమాధి చేయడంగానీ, నదులలో, సముద్రంలో ముంచడంగానీ చేస్తారు. మొహరం సంద ర్భంగా కొన్నిచోట్ల ఆ దుఃఖకరమైన సంఘ టనను తెలియజేసే నాటకాలు కూడా ప్రదర్శిస్తారు.

మొహరం నెల తొలి పది రోజులు ఉపవా సాలతోనూ, సంతాపంతోనూ, ప్రార్థనలతోనూ గడుపుతారు.

## పంజాబ్ జానపద కథ

పంచ నదుల భూమిగా ప్రఖ్యాతిగాంచిన పంజాబ్ వాయవ్య భారతదేశంలో ఉంది. ఈ ప్రాంతంలో బీయస్, సట్లజ్, రావి, చీనాబ్, జీలం నదులున్నాయి. ఇటీవల జరిగిన సరిహద్దురేఖల మార్పుల కారణంగా ప్రస్తుతం సట్లజ్, బీయస్ అనే రెండు నదులు మాత్రమే పంజాబ్ రాష్ట్ర సరిహద్దుల లోపల ప్రవహిస్తున్నాయి.

పంజాబుకు ఉత్తరంగా జమ్మూ-కాశ్మీరు, తూర్పుదిశగా హిమాచలప్రదేశ్, దక్షిణంగా హర్యానా-రాజస్థాన్ రాష్ట్రాలూ, పశ్చిమంగా పాకిస్తాన్ ఉన్నాయి. పంజాబ్, హర్యానా రాష్ట్రాలకు చండీఘడ్ నగరం ఉమ్మడి రాజధాని. 50,000 చ.కి.మీ వైశాల్యం గల ఈ రాష్ట్ర జనాభా 24,209,300. అధికారభాష పంజాబీ, లిపి గురుముఖి.

ఈనాటి పంజాబ్ రాష్ట్రం 1966 నవంబర్ 1వ తేదీ ఏర్పడింది. అప్పుడే అందులో కొంతభాగం విడిపోయి సంపూర్ణ హర్యానా రాష్ట్రంగా రూపొందింది.

మనదేశంలో వ్యవసాయ రంగంలో సాంకేతికంగా ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టి హరిత విప్లవానికి మార్గం చూపిన మొట్టమొదటి రాష్ట్రం పంజాబ్. పాడి పరిశ్రమలోనూ అధిక ఉత్పత్తి సాధించి పంజాబ్ రికార్డు సృష్టించింది.

# ఏడవ రాజకుమారుడి వివాహం!

ఒకానొకప్పుడు సతీందర్ అనే రాజుకు ఏడుగురు కుమారులు ఉండేవారు. పొరుగు రాజ్యాన్నేలే భతీందర్ రాజుకు ఏడుగురు కుమార్తెలు. సతీందర్ కుమారులు యుక్తవయస్కులయ్యాక వారికి వివాహంచేయాలనుకున్నాడు రాజు. బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. పొరుగు రాజు భతీందర్ కుమార్తెలే తన కుమారులకు తగిన వధువులని, ఆ సంగతిని విశ్వాసపాత్రుడైన దూతద్వారా ఆ రాజుకు తెలియజేశాడు.



ఆ మాట వినగానే భతీందర్‌కు ఆనందంతో నోట మాట రాలేదు. తన ఏడుగురు కుమార్తెలకూ ఒకేచోట వివాహం జరిగే అదృష్టానికి మురిసి పోయాడు. వెంటనే అంగీకరించాడు.

సతీందర్ ఆరుగురు కొడుకులూ పెళ్ళికి సంతోషంగా అంగీకరించారు. కానీ ఏడవ కుమారుడు రాజేందర్ ఎదురుతిరిగాడు. అన్న లందరూ పెళ్ళిచేసుకుంటున్నంతమాత్రాన తనుకూడా పెళ్ళి చేసుకోవాలనే నిర్బంధం ఎందుకు? అని ఆలోచించే వింత మనస్తత్వం అతడిది.

"అందరితోపాటు నువ్వూ పెళ్ళిచేసుకో నాయనా! నాకు ఆనందం కలిగించు," అని రాజు కుమారుడికి ఎంతో చెప్పాడు. కానీ రాజేం దర్ ససేమిరా అనేశాడు.

మరోమార్గం లేక రాజు సతీందర్ ఆరుగురు కుమారులకూ, ఆరుగురు భతీందర్ కుమార్తె లతో వివాహం జరిపించాడు. ఆరుగురు రాకుమా ర్తెలూ భర్తల వద్దకు వచ్చారు. ఏడవకుమార్తె మాత్రం తన తల్లితండ్రులవద్దే ఉండిపోయింది.

రాజేందర్‌ను ఎలాగైనా ఒప్పించి, తమచెల్లెలికీ అతనికీ పెళ్ళిచేయించాలని ఆరుగురు కోడళ్ళూ ఎంతగానో ప్రయత్నించారు. అయితే, రాజేందర్ మాత్రం అసలు ఒప్పుకోలేదు. ఆఖరికి విసిగి పోయిన పెద్దకోడలు, "సరి, నా చెల్లెల్ని వద్దం టున్నావు, మరి ఎవర్ని చేసుకుంటావు? అనార్కలిని వివాహమాడబోతావా? ఆమె ఎక్కడ వున్నదీ ఎలా తెలుసుకుంటావు?" అంటూ వెళ్ళిపోయింది.

మిగిలిన కోడళ్ళు కూడా రాజేందర్ కనిపించి నప్పుడల్లా, "అవును, అనార్కలిని పెళ్ళాడబోతావు కదా? ఎప్పుడు పెళ్ళి?" అని ఎగతాళిచేయసాగారు.

ఆ మాటలు వినీ వినీ రాజేందర్‌కు ఒకనాడు పట్టరానికోపం వచ్చింది. తండ్రితో, "ఇప్పుడే బయలుదేరి వెళుతున్నాను. అనార్కలిని కను క్కొని, పెళ్ళాడితే తప్ప, తిరిగి రాను," అన్నాడు.

తండ్రి విచారపడ్డాడు. తల్లి వెళ్ళవద్దని



ప్రాథేయపడింది. అన్నలు తిట్టారు. అయినా, రాజేందర్ మీద అవేమీ పనిచేయలేదు. తను అభిమానించే తెల్లగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. అనార్కలి అసలు ఉందా? ఒకవేళ ఉంటే ఎక్కడ ఉందో ఏమో తెలియనప్పటికీ గుర్రం దారితీసిన దిశగా ప్రయాణాన్ని సాగించాడు.

అలా అతడు చాలాదూరం వెళ్ళాక ఒక ఉద్యానవనం కనిపించింది. అందులో పూల మొక్కలూ, ఫలవృక్షాలూ నీళ్ళులేక వాడిపోయి, కొన్ని ఎండిపోతూ కనిపించాయి. రాజేందర్ అప్పటికే బాగా అలిసిపోవడంతో గుర్రం దిగి ఒక చెట్టు నీడన కూర్చున్నాడు. కొంతసేపటికి అలాగే నిద్రపోయాడు. అతడు మేల్కొని చూసేసరికి సాయంకాలమయింది. లేచి చుట్టుపక్కల కలయచూశాడు. కొంతదూరంలో చిన్న కొలను, దాని ఒడ్డున కొన్ని కుండలూ కనిపించాయి. కొలనులో నీళ్ళు తాగి దాహం తీర్చుకున్నాక, ఎండిపోతూన్న చెట్లకు నీళ్ళు పోయాలను కున్నాడు. ఒక కుండను తీసుకుని చెట్లన్నిటికీ నీళ్ళుపోసి, కుండను యథాస్థానంలో పెట్టి

## బల్లె బల్లే!

పంజాబ్ అనగానే గిద్దా, భంగ్రా జానపద నృత్యాలు మనసులో కదలాడుతాయి. బైసాఖి (ఏప్రిల్ 13) సమయంలో పంటలు నూర్పిళ్ళు పూర్తికాగానే గ్రామాలలో పూర్వం భంగ్రా నృత్యాలు ప్రదర్శించేవాళ్ళు. అయితే, ప్రస్తుతం పెళ్ళిళ్ళు, పుట్టిన రోజులు, నూతన సంవత్సర ఉత్సవాలు మొదలైన ప్రతి సామూహిక కార్యక్రమాలన్నిటిలోనూ భంగ్రా నృత్యాలు కనిపిస్తాయి!

జానపద నృత్యాల ప్రత్యేక ఆకర్షణ—లయబద్ధంగా వేగంగా సాగే సంగీతం. ఈ నృత్యంలో ఉపయోగపడే చాలాముఖ్యమైన సంగీత వాద్యం డోల్ అనే ఒక విధమైన మృదంగం. పాటలు చాలామట్టుకు ప్రాచీన పంజాబు కథలకు సంబంధించినవిగానే ఉంటాయి.

ఉద్యానవనాన్ని పరిశీలనగా చూడసాగాడు.

ఉద్యానవనంలో ఒక వటవృక్షం కింద ధ్యాన నిమగ్నుడై ఒక ముని కనిపించాడు. ఆ ముని కళ్ళు తెరిస్తే అనార్కలిని గురించి అడగవచ్చు కదా అని రాజేందర్ అక్కడే కూర్చున్నాడు. కానీ ముని ఎంతసేపటికీ కళ్ళు తెరవలేదు!

అసలు విషయం ఏమిటంటే—రకరకాల పూలమొక్కలతో, ఫలవృక్షాలతో ఆ ఉద్యాన వనాన్ని రూపొందించిందే ఆ ముని. సంవత్సరంలో ఆరు నెలలు ఉద్యానవనాన్ని రక్షిస్తూ గడిపి, మరో ఆరు నెలలు తపస్సు చేయడం ఆ ముని నియమం!

ముని కనులు తెరిచి, అనార్కలిని గురించి చెప్పేంతవరకు అక్కడినుంచి కదలకూడదనుకున్న రాకుమారుడు రాజేందర్, వనంలోని చెట్లకు నీళ్ళుపోస్తూ, వాటి రక్షణను చూడసాగాడు.



కొన్ని రోజులలో ఆ వనం సువాసనలు విరజిమ్మే రంగు రంగుల పుష్పాలతో, సుమధుర ఫలాలతో కళకళలాడసాగింది.

ఒకనాడు సూర్యోదయ సమయంలో ముని ధ్యానం ముగించి, మెల్లగా కళ్ళు తెరిచాడు. ఉదయభానుడి లేత బంగారు కిరణాలు రకరకాల పువ్వులమీద పడడంతో ఆ తపోవనం వింతశోభతో కళకళలాడుతున్నది. అప్పుడే చేతిలో నీళ్ళ కుండతో రాజేందర్ అటుకేసి వచ్చాడు. కుండను పక్కనపెట్టి ముని పాదాలకు నమస్కరించాడు.

"నువ్వేనా, ఇన్నాళ్ళు ఈ తపోవనాన్ని రక్షించింది?" అని అడిగాడు ముని.

"మొక్కలకు నీళ్ళుపోయడం తప్ప మరేం గొప్పగా చేయలేదు మహాత్మా!" అన్నాడు రాజేందర్ వినయంగా.

"చెట్లపై కనికరం చూపిన నీ దయాగుణం చాలా గొప్పది! నీకు కావలసిన వరం ఇస్తాను, కోరుకో!" అన్నాడు ముని.

"చాలా కృతజ్ఞుణ్ణి మహాత్మా! నేనొక రాజకుమారుణ్ణి! సిరిసంపదలకు నాకు లోటులేదు. అయితే, నేను అనార్కలికోసం వెతుక్కుంటూ ఇటు వచ్చాను. ఆమె ఎక్కడున్నదో చెబితే, మీకు నా జన్మాంతం కృతజ్ఞుడిగా ఉంటాను," అన్నాడు

రాజేందర్ చేతులు జోడించి.

ముని ఒక బంతిని రాజేందర్ చేతికి ఇస్తూ, ''నాయనా, ఈ బంతిని తీసుకో. దీనిని నువ్వు నడిచేమార్గంలో విసిరావంటే అది దొర్లుకుంటూ వెళ్ళి ఒక దానిమ్మచెట్టు బోదెవద్ద ఆగుతుంది. నువ్వు ఆ చెట్టులో కనిపించే పెద్ద పండును కోసుకో. అందులోనే నీకు అనార్కలి లభిస్తుంది. అయితే నువ్వు నీ భవనం చేరేంతవరకు, పండును ఒలిచి చూడకూడదు. అలా చేశావో ఆమె నీకు దక్కదు. జాగ్రత్త సుమా!'' అని చెప్పి ఆశీర్వదించాడు.

రాజకుమారుడు ఆయన చెప్పినట్టే చేసి, పెద్ద దానిమ్మ పండుతో తన భవనాన్ని సమీపించాడు. కొంత సేపు విశ్రాంతి తీసుకుని వెళదామని రాజోద్యానంలోని ఒక చెట్టునీడలో కూర్చున్నాడు. కొంతసేపటికి అతడి మనసులో చిన్న అనుమానం తలెత్తింది. 'ఒక వేళ ముని చెప్పినట్టు పండులోపల అనార్కలి కనిపించకపోతే, తను అందరి ముందూ నవ్వులపాలు కావలసి వస్తుంది కదా! ఎటొచ్చీ భవనాన్ని సమీపించాను గనక, ఇక్కడే పండును కోసి చూడడం మంచిది కదా' అని పండును కోసి చూశాడు. ఆ క్షణమే ఆ పండునుంచి పచ్చటి బంగారు రంగు దుస్తులు ధరించి మెడలో అందమైన హారంతో ఒక అందాల యువతి నవ్వుతూ వెలుపలికి వచ్చింది. మెరుపుతీగ లాంటి ఆ సౌందర్య రాశిని చూడగానే రాకుమారుడు ఆశ్చర్యంతో మూర్ఛబోయాడు. ఆ యువతి పేరే అనార్కలి! ఆమె రాకుమారుడి పక్కన కూర్చుని, కొంగుతో మెల్లగా వీచ సాగింది.

అప్పుడే అటుకేసి వచ్చిన హర్‌ప్రీత్ అనే మరొక యువతి, అనార్కలిని చూసి, ''అందాల రాశీ! ఎవరు నువ్వు? ఇక్కడేం చేస్తున్నావు?'' అని అడిగింది.

అనార్కలి జరిగినదంతా చెప్పి, ''నన్ను చూసిన క్షణమే ఈ రాకుమారుడు మూర్ఛబోయాడు. ఇతడికి స్పృహ రావాలి. అందుకే



కూర్చుని ఉన్నాను,'' అన్నది.

హర్‌ప్రీత్ రాకుమారుణ్ణి పెళ్ళాడాలనుకుంటున్నది. అందువల్ల, అనార్కలి దుస్తులనూ, ఆభరణాలనూ చూసి అబ్బురపడినట్టు నటిస్తూ, ''ఎంత అందమైన దుస్తులు ధరించావు. ఈ మెడలోని హారం, ఆహా! చాలా అందంగా ఉంది. అలాంటి దుస్తులను నేనెప్పుడూ ధరించలేదు. వాటిని ధరించి నా అందం చూడాలని ఆశగా ఉంది. నా దుస్తులనూ, ఆభరణాలనూ నువ్వూ, నీ దుస్తులనూ, ఆభరణాలనూ నేనూ కాస్సేపు మార్చుకుందామా?'' అన్నది.

అనార్కలి ఒక్క నిమిషం ఆలోచించి సరేనని తన దుస్తులనూ, ఆభరణాలనూ తీసి హర్‌ప్రీత్‌కిచ్చి, ఆమె దుస్తులను తాను ధరించింది. అనార్కలి దుస్తులను ధరించిన హర్‌ప్రీత్, మురిసిపోతూ వాటికేసి చూస్తూ, ''ఆహా! చాలా బావున్నాయి. అయినా, ఈ అందమైన దుస్తులతో నేనెలా ఉన్నానో చూసుకోవాలని ఉంది. ఈ ఉద్యానవనం మధ్య ఒక బావి ఉంది. అందులో నీ దుస్తులతో నా ప్రతిబింబం చూడాలని కోరికగా ఉంది. నువ్వూ వస్తావా, వెళ్ళి చూద్దాం!'' అన్నది.

అనార్కలి సరేనని ఆమె వెంట నడిచింది. బావి గట్టును చేరాక ఇద్దరూ బావిలోకి తొంగి

చూశారు. ఆ క్షణమే హర్‌ప్రీత్, అనార్కలిని బావిలోకి తోసి, గబగబా వెనక్కు తిరిగివచ్చి, మేలి ముసుగుతో, అనార్కలి స్థానంలో కూర్చున్నది. కొంతసేపటికి రాకుమారుడు రాజేందర్ కళ్ళు తెరిచి చూశాడు. హర్‌ప్రీత్ తానే అనార్కలి అన్నది. తను చూసింది అపూర్వ అందాలరాశిని కదా అని రాజేందర్ ఒక్క క్షణం అనుమానించాడు. అయినా, చుట్టుపక్కల ఎవరూ లేరుకదా? ఇంతలో అంత మార్పు ఎలావస్తుందని మనసును సమాధాన పరచుకుని, ఆమెను వెంటబెట్టుకుని రాజ భవనంలోకి వెళ్ళాడు.

రాజభవనంలో వారికి ఘనస్వాగతం లభించింది. ఇద్దరికీ వైభవంగా వివాహం జరిగింది. హాయిగా కాలం గడపసాగారు.

కొన్నాళ్ళకు రాజభవనం సమీప ఉద్యాన వనంలోని బావిలో ఒక అందమైన పువ్వు పూచిందనీ, దానిని ఎవరూ కోయలేకపోతున్నారనీ ఒక వార్త నగరమంతా వ్యాపించింది. అది హర్‌ప్రీత్ చెవినకూడా పడింది. ఆ బావిలోనే హర్‌ప్రీత్, అనార్కలిని తోసింది!

మరునాడే ఆమె అలవికాని తలనొప్పి అంటూ పడుకున్నది.

భర్త రాజేందర్ ఆమె దగ్గరికి వెళ్ళి సంగతేమిటని అడిగాడు. "భరించరాని తలనొప్పితో బాధ పడుతున్నాను. ఉద్యానవనంలోని బావిలో పూచిన పువ్వును తెచ్చి దాని రేకులను మెత్తగా నూరి పట్టె వేస్తేనే తలనొప్పి తగ్గుతుందని వైద్యులు చెబుతున్నారు!" అన్నది హర్‌ప్రీత్ కన్నీళ్ళతో.

"అదెంతపని?" అంటూ రాజేందర్ వెంటనే వెళ్ళి ఆ పువ్వును కోసి తెచ్చి, రేకులను నూరి భార్య నుదుట పట్టె వేశాడు. తలనొప్పి నిజంగానే భరించలేనంతగా ఎక్కువ కావడంతో ఆమె పట్టెను తీసి భవనంపైనుంచి పిట్టగోడమీదుగా కిందికి విసిరికొట్టింది.

ఆ పట్టె పడినచోట అందమైన పండ్ల తోట ఏర్పడింది. తోటమధ్య బ్రహ్మాండమైన దానిమ్మ చెట్టు మొలిచి, ఎర్రటి పెద్ద పండుతో కన్నుల విందు చేయసాగింది.

కొన్నిరోజుల తరవాత హర్‌ప్రీత్ భవనం ఉపరితలానికి వెళ్ళింది. అక్కడ ఏర్పడిన తోటనూ, దానిమ్మచెట్టునూ, పండునూ చూసి దిగ్భ్రాంతి చెందింది. చివుక్కున వెనుతిరిగి వెళ్ళి శయన మందిరంలో పడుకుని మూలగసాగింది. భర్త కారణం అడిగాడు. "తలపోటే కాదు, ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. మన భవనాన్ని ఆనుకుని ఉన్న తోటను తొలగిస్తే తప్ప నా బాధ పోదు!" అన్నది ఏడుస్తూ.

రాజేందర్ తన తోటలోని మొక్కలనూ, చెట్లనూ, పూలనూ, పళ్ళనూ ఎవరు కావాలన్నా తీసుకువెళ్ళవచ్చని భటులద్వారా చాటింపు వేయించాడు.

పలువురు నగర ప్రజలు తోటలో ప్రవేశించి

## హస్త కళలు

పంజాబ్ హస్తకళలకు ప్రసిద్ధిగాంచింది. నేలమీద పరిచే ఆకర్షణీయమైన తివాసీలను యువతులు నేస్తారు. సంప్రదాయంగా వస్తూన్న డిజైన్లనూ, అచ్చులనూ ఉపయోగిస్తారు. పంజాబుకే విలక్షణమైన మరొక హస్తకళ పుల్కారీ అనే అల్లిక పని. చేతి రుమాళ్ళతోసహా అన్ని వస్త్రాలమీదా నూలుదారాలతో వీటిని అల్లుతారు. కొయ్య శిల్పాలకూ, చెక్కడపు పనులకూ కూడా పంజాబ్ చాలా ప్రసిద్ధి.





తమకు కావలసినవాటిని తీసుకు వెళ్ళసాగారు. ఆఖరికి ఒక పసివాడు అక్కడికి వచ్చాడు. అతనికి దానిమ్మ చెట్టు చిటారు కొమ్మలో వేలాడుతూన్న పెద్దపండు మాత్రమే కనిపించింది. ఎందుకోగాని దాన్ని ఎవరూ ముట్టుకోలేదు. ఆ కుర్రవాడు దానిని కోసుకుపోయి వృద్ధురాలైన తన తల్లి చేతికి ఇచ్చాడు. రాత్రి భోజనం అయ్యాక, తల్లి ఆ పండును కోసింది. మరుక్షణమే ఆ పండు నుంచి అనార్కలి వెలుపలికి వచ్చింది.

''భయపడకండి! నన్ను మీ కుమార్తెగా భావించండి. నేను మీ సంపద పెరగడానికి సాయ పడతాను,'' అన్నది అనార్కలి.

ఆ అందాలరాశిని చూసి తల్లీకొడుకులు ఆనందాశ్చర్యాలు పొందారు.

మరునాడు అనార్కలి ఒక గుడ్డముక్కనూ, నూలు దారాలనూ తీసుకుని ఫుల్కారీ రుమాలును అల్లి పసివాడి చేతికిచ్చి, ''దీనిని యువరాజు రాజేందర్ దగ్గరికి తీసుకు వెళ్ళావంటే మంచిధర చెల్లించగలడు!'' అన్నది.

కుర్రవాడు ఆమె చెప్పినట్టే చేశాడు. రుమాలును చూడగానే ఎంతో సంతోషించిన రాజేందర్ దానిని ఎవరు అల్లారని అడిగాడు.

''మా అక్క!'' అన్నాడు కుర్రవాడు.

ఇంత అందంగా, అద్భుతంగా అల్లగలిగిన వ్యక్తికూడా అందంగా, అద్భుతంగానే ఉండాలని భావించిన యువరాజు, ''నన్ను నీతో మీ ఇంటికి తీసుకు వెళతావా? నేను ఆమెను చూడాలి!'' అన్నాడు.

కుర్రవాడు యువరాజు మాట కాదనలేక ఆయన్ను తన ఇంటికి తీసుకువెళ్ళాడు. అనార్కలిని చూడగానే రాకుమారుడు గుర్తించాడు. ఆమె జరిగినదంతా అతడికి చెప్పింది. ఆమె తల్లి అనుమతితో ఆమెను వివాహమాడి రాజభవనానికి తీసుకువచ్చాడు. హర్‌ప్రీత్‌ను రాజ్యం నుంచి తరుమగొట్టాడు.

రాజేందర్, అనార్కలి చిరకాలం సుఖసంతోషాలతో జీవించారు.

## ఆసక్తికర ప్రదేశాలు

అమృత్‌సర్ శిక్కుల పవిత్ర నగరం. అమృతసరస్సు అనే మాట నుంచి ఈ పేరు వచ్చింది. శిక్కుల నాలగవ మతగురువు, గురురాందాస్ ఈ నగరాన్ని నిర్మించాడు. అమృత్‌సర్‌లోని స్వర్ణదేవాలయం శిక్కులకు చాలా పవిత్రమైనది. ఆలయ ప్రధాన గుమ్మటం ఉపరిభాగం బంగారు రేకులతో కప్పబడి ఉండడం వల్లదీనికీపేరు వచ్చింది.

1919 లో దురాగతం జరిగిన జలియన్ వాలాబాగ్ దీని సమీపంలోనే ఉంది.

మనదేశంలో ఒక నిర్దిష్ట పథకం ప్రకారం నిర్మించబడిన మొట్టమొదటి ఆధునిక నగరం చండీఘడ్ అని చెప్పవచ్చు. సుప్రసిద్ధ ఫ్రెంచ్ ఆర్కిటెక్ట్ లీ కోర్బూసియర్ దీనికి రూపకల్పన చేశాడు. రాక్‌గార్డెన్, రోజ్‌గార్డెన్, పింజార్ గార్డెన్ ఈ రాజధానీ నగరంలోని ప్రధాన ఆకర్షణలు.

# తెలివైన పిల్లపిచ్చుక!

ఒంటరిగా మిగిలిపోయిన పిల్లపిచ్చుక కేసి తల్లి పిచ్చుక అనుమానంగా చూసింది. దాంతోపాటు గుడ్ల నుంచి బయటపడిన మిగిలిన పిల్లపిచ్చుక లన్నీ తమ బతుకు తాము బతకడానికి ఎటెటో ఎగిరి వెళ్ళిపోయాయి. ఇది మాత్రం గూట్లోనే ఉండి పోయింది. నిర్మలంగానూ, చాలా అమాయకంగానూ కనిపించే పిచ్చుకపిల్ల పెద్దపెద్ద కళ్ళుచూస్తూంటే, ఇది ఎప్పటికి ఎగరడం నేర్చుకుంటుందా అని తల్లి పిచ్చుక మనసులో సందేహం పొడసూపింది.

తల్లిగా నావల్ల చేతనైన సాయం చేస్తాను. ఆ తరవాత దాని బతుకు అది బతక నేర్చుకోక తప్పదు అనుకుంటూ పెద్దగా నిట్టూర్చి, తల్లి పిచ్చుక తనపిల్లతో, "రా తల్లీ! నువ్విప్పుడు ఎగరడం నేర్చుకోవాలి!" అన్నది ఆప్యాయంగా.

పిల్లపిచ్చుక, "అలాగేనమ్మా!" అంటూ పెద్ద పెద్ద కళ్ళను అటూ ఇటూ తిప్పుతూ, తల్లిని మెల్లగా అనుసరించింది.




మెల్లగా గెంతడం, చెట్టుమీద ఒక కొమ్మపై నుంచి మరొక కొమ్మమీదికి దాటడం, ఒక చెట్టుపై నుంచి మరొక చెట్టు మీదికి ఎగరడం ఇలా అంచెలంచె లుగా బాగా ఎగరడంనేర్చుకున్నది. కొన్నిరోజులలో ఒంటరిగా గ్రామాన్ని చుట్టి పలుసార్లు సునాయాసంగా తిరిగి రాసాగింది.

దానిని చూసి తల్లిపిచ్చుక చాలా సంతోషిం చింది. అయితే, మరికొంత సేపటికి దానికి మరొక విచారం పట్టుకున్నది. బుల్లిపిచ్చుక ఎగరడం అయితే నేర్చుకున్నదిగాని, దానికి లోకంపోకడ తెలియదే! ప్రపంచమార్గం తెలుసుకోవడం అంత తేలికకాదు కదా? కాబట్టి దానిని గురించి తన బిడ్డకు కొన్ని సూచనలివ్వాలని నిర్ణయించింది తల్లిపిచ్చుక.

"తల్లీ! నువ్వు ఇప్పుడు నిన్ను నువ్వు ఎలా కాపాడు కోవాలో తెలుసుకోవాలి. అందుకు కొన్ని సలహాలి స్తాను. వాటిని జాగ్రత్తగా పాటించాలి సుమా!" అని, కొంతసేపు ఆగి, మళ్ళీ "నువ్వు ఏదైనా ఒక పొలంలో ఉన్నప్పుడు దూరంగా మనిషిగాని, కుర్రాడుగాని చేత విల్లు, బాణాలు లేదా ఉండేలుబద్దతో వస్తు న్నట్టు తెలిసిందనుకో వెంటనే ఎగిరిపోవాలి! వాళ్ళు నిన్ను తప్పక కొట్టగలరు," అన్నది.

"అలాగేనమ్మా!" అంటూ తలాడించింది పిల్ల పిచ్చుక.

"ఎవరైనా సమీపానికి వచ్చి చటుక్కున కిందికి వంగారనుకో, వెంటనే ఎగిరిపోవాలి! అలా వంగేవాడు నీ మీద విసరడానికి రాయిని తీసుకుంటాడు; తెలి సిందా?" అని అడిగింది తల్లిపిచ్చుక.

"తెలిసింది!" అన్నది పిల్లపిచ్చుక.

"కిందికి వంగనివాణ్ణీ, చేతిలో ఎలాంటి ఆయు ధంలేనివాణ్ణీ చూసి ఏమాత్రం జడుసుకోనవసరం లేదు," అని చెప్పింది తల్లిపిచ్చుక.

"మరయితే, ఎవడైనా జేబులో రాయి తీసుకు వస్తే ఏమవుతుంది?" అని అడిగింది పిల్లపిచ్చుక.

తల్లిపిచ్చుక ఒక్కక్షణం మౌనంవహించి, ఆ తరవాత, "నాకంటే నీకే ఎక్కువ తెలుసు. హాయిగా బతికిపోగలవు! ఇక, వెళ్ళి రా!" అంటూ రివ్వున ఎగిరిపోయింది.



# విఘ్నేశ్వరుడు

తారకాసురుడి నిరంకుశత్వానికి తోడుగా, త్రిపురాసురులనే ముగ్గురు రాక్షసులు తపస్సులు చేసి వరాలు పొంది ఆకాశంలో ఎగురుతూ తిరిగే మూడు పట్టణాలను నిర్మించుకొని, ముల్లోకాల మీద విరుచుకు పడ్డారు. మూడు పురాల మీద ఎగురుతూ అగ్ని గోళాల్ని కురిపిస్తూ, పట్టణాలనూ, పచ్చని పల్లెలనూ తగల బెడుతూ విధ్వంసకాండ సాగిస్తున్నారు. జగత్తు అట్టుడికి పోతున్నది.

వారిని అంతమొందించగలవాడు శివుడొక్కడే అని తెలిసిన దేవతలు అంతా కలసి వచ్చి, మందిర ప్రాంగణంలో హోరెత్తేలాగా ప్రార్థనలు చేశారు.

పెళ్లాడిన కొత్తలోనే ఏదో బెడద వచ్చిందని శివుడు విసవిసలాడినా, త్రిపురాసురులు చేస్తున్న మారణహోమం విన్న మీదట ఉద్రేకం పుట్టి మూలనున్న త్రిశూలాన్ని దుమ్ము దులిపి పట్టుకుని, తన అనుచరుల్నీ, ప్రమథ గణాలనూ వెంటబెట్టుకుని, త్రిపురాసురులను తుదముట్టించడానికి ఆవేశంతో కదిలాడు.

అదేసమయంలో జడల ఏనుగుగా మారి లోకాల్ని బీభత్సంచేస్తూ, ఒక రాక్షసరాజు బయలుదేరాడు. బ్రహ్మాండమైన ఏనుగు రూపం కారణంగా అతడికి గజాసురుడు అన్న పేరువచ్చింది. అతడు సాటిలేని గొప్ప శివ భక్తుడు. శివుడివల్ల తప్ప మరెవరివల్లా చావు లేని వరం పొందాడు.

"శివుణ్ణి నీ లోపలే ఉంచేసుకుంటే మరీ మంచిది గదా!" అని నారదుడు గజాసురుడి మేలుకోరుతున్నవాడిలాగా అతడితో చెప్పాడు. గజాసురుడు వెంటనే ఉగ్రమైన ఆరాధనతో శివుణ్ణి గూర్చి తపస్సు మొదలుపెట్టి శివుణ్ణి



మెప్పించాడు. త్రిపురాసుర సంహారానికని బయలుదేరిన శివుడు గజాసురుడి కోరిక ప్రకారం గజాసురుడి గుండెలో లింగ రూపంతో ఉండిపోయాడు.

"శివుడు గజాసురుడి గుండెలో ఉండిపోతే త్రిపురాసుర సంహారం ఎలా జరుగుతుంది? నవవధువు పార్వతి ముచ్చట తీరేదెలా? శివుడికీ, పార్వతికీ పుట్టవలసిఉన్నవాడివల్లనే కదా తారకాసురుడిఅంతం జరగాలి?" అని దేవతలు అంతా దిగులు ముఖాలు వేస్తూంటేనారదుడు, "శివుడు ఉబ్బులింగడు కదా!" అని ఉపాయం అందించాడు. మరుక్షణమే దేవతలంతా గజాసురుడి ఎదట శివుణ్ణి పొగుడుతూ గొంతెత్తి స్తోత్ర పాఠాలు మొదలు పెట్టారు.

గజాసురుడు కూడా తన్మయుడై వారితో కలిసి శివభజన సాగించాడు. శివలింగం ఉబ్బి అలాఅలా పెరిగిపోతూ గజాసురుడిని చీల్చి వేసింది. శివుడు ఇవతల పడ్డాడు. గజాసురుడు కన్నుమూస్తూ, "నిన్ను నమ్ముకుంటే ఇలా చేశావేమిటి!" అని శివుణ్ణి నిందించగా, "గజా! శివభక్తికి తార్కాణంగా కలకాలం నీ పేరు నిలిచేలాగ ఏనుగు తల నాకు సన్నిహితంగా ఉంటుంది. గజచర్మాన్ని కట్టుకుంటాను," అని శివుడు చెబుతూ గజాసురుడిని తనలోకి తీసుకుని కైవల్యాన్ని ప్రసాదించాడు.

శివుడు భూమిని రథంగా, సూర్యచంద్రుల్ని రథచక్రాలుగా, వేదాలు గుర్రాలుగా, బ్రహ్మ సారథిగా, మేరుపర్వతాన్ని ధనుస్సుగా, విష్ణువును బాణంగా సమకూర్చుకుని, తన అనుచరులైన నందీ, శృంగీ, భృంగీ మొదలైన ప్రమథగణాలను వెంట వేసుకుని, ముక్కోటి దేవతలు వారివారి దేవేరులతో సహా వెనుకరాగా, భయంకరులైన త్రిపురాసురులపై యుద్ధానికి వెళ్ళాడు.

ఇంట్లో ఒంటరి పార్వతికికాలం బరువుగా గడుస్తున్నది. శివుడు ఎప్పుడు వచ్చేదీ తెలీదు. ఆ సమయంలో నారదుడు వచ్చి, "అమ్మాయి పార్వతీ! శివుడు నిన్ను పెళ్ళాడినప్పట్నించీ తారకాసురుడు తల్లడిల్లిపోతూ పీడకలలు కంటున్నాడు. నీకు ఎలాంటి హాని తలపెడతాడో ఏమో. వాడికి వజ్రదంతుడు తోడై ఉన్నాడు. వజ్రదంతుడు బహుమాయావి! అందువల్ల నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి సుమా!" అని హెచ్చరించి వెళ్ళాడు.

పార్వతికి మరింత చిరాకు, దిగులు కూడా కలిగాయి. చక్కగా తలంటుస్నానం చేస్తే చిరాకు తగ్గి బాగుంటుందనిపించింది.

పార్వతి నలుగుపెట్టుకుని, ఆ నలుగు ముద్ద కూడదీసి, ఆ ముద్దతో ఒక బొమ్మచేసి ముచ్చటగా చూసుకుని అలా కిందపెట్టి అటు

తిరిగి ఇటు చూసేసరికి బొమ్మకు మారుగా ముద్దులుమూటగట్టే బాలుడు కనిపించాడు. ''ఎవరబ్బా, నీవు?'' అని పార్వతి అడిగింది ఆశ్చర్యంగా.

''నీ కాంతిని పుణికి పుచ్చుకుని రాలిన నలుగుముద్దనే కదుటమ్మా! నీ పుత్రుణ్ణి, పుత్రగణపతిని!'' అన్నాడు బాలుడు అందంగా నవ్వుతూ.

పార్వతి బాలుణ్ణి అక్కున చేర్చుకుని ముద్దాడి, ఒక అంకుశ గదాదండాన్ని అతని చేతికిచ్చి, ''నాయనా! ఎవ్వరినీ, పురుగునైనా లోపలికి రానీయకు,'' అని చెప్పి సింహ ద్వారం దగ్గిర కాపలా ఉంచింది.

''అమ్మా! తినడానికేమైనా పెట్టవూ,'' అని అడిగాడు కుర్రవాడు.

అప్పటికప్పుడు పిండి కలిపి చలిమిడి ముద్దనూ, కుడుములూ, ఉండ్రాళ్ళనూ చేసి ఇచ్చి పార్వతి స్నానానికిభవనం లోపలికి వెళ్ళింది.

పార్వతిని అంతమొందించితే శివుడికి కొడుకు పుట్టే అవకాశం లేదు, తన ప్రాణానికి భయం ఉండదని తలచి తారకాసురుడు వజ్రదంతుణ్ణి పార్వతిని అపహరించుకుని రమ్మని పురమాయించాడు. వజ్రదంతుడు వజ్రాయుధాన్ని పరపర కొరికిపారేయగల వాడికోరలు గల పెద్ద రాక్షసుడు. ఎలుక రూపంతో కొండల్ని దొల్చి పిండిచేస్తూ, మూషికాసురుడు అని కూడా పేరుపడ్డాడు. పార్వతిని అపహరించుకురావడానికి ముందు గజకర్ణి, గోకర్ణి అనే తన ముఖ్యానుచరులైన రాక్షసులిద్దర్ని పంపించాడు.

వాళ్ళు దున్నపోతుల్లా బలిసిన కుర్రాళ్ళ రూపంతో వెళ్ళి, దొంగచూపులు చూస్తూ,



సింహద్వారం దగ్గిర అంకుశ గదాదండాన్ని పట్టి మందహాసంతో అటూఇటూ తిరుగుతూ కాపలా కాస్తున్న బాలుణ్ణి, ''ఆడుకుందాం రా!'' అని పిలిచారు.

బాలుడు వాళ్ళను చూడనట్టే చూసి, నవ్వుతూ, ''ముందు కాస్త తినండిరా!'' అంటూ రెండు చలిమిడి ముద్దలు వాళ్ళ మీదకు విసిరాడు. వాళ్ళు తలలు దిమ్మతిరిగి పారిపోబో తూంటే, రెండు ఉండ్రాళ్ళు పెద్ద బండరాళ్ళై వాళ్ళముందు పడగా బోర్లాపడ్డారు. పుత్ర గణపతి వాళ్ళను పిలిచి, ''చెవులు పట్టుకుని మూడేసి గుంజీలు తీసి, లెంపలేసుకుని మరీ పొండిరా!'' అని ఆజ్ఞాపించాడు.

వాళ్ళలాగే చేసి, ఉరుకులతో, పరుగు లతో వెళ్ళి రాక్షసరూపాలతో తమ నాయకుడైన వజ్రదంతుడికి ఎగ ఊపిరితో జరిగింది వివ రంగా చెప్పారు.



వజ్రదంతుడు హుంకరించి ఎలుక రూపంతో వెళ్ళి ద్వారానికి సమీపంలో బొరియ చేసి దూరబోతూండగా పుత్ర గణపతి మొలపాశాన్ని తీసి ఉచ్చుపన్ని విసిరి మూషికాన్ని పట్టాడు. ఉచ్చు మెడకు బిగిసి కీచుకీచుమంటూన్న దాని నెత్తిన నాలుగు మొట్టికాయలు పెట్టి, తోక పట్టుకుని గిరగిరా తిప్పి విసిరేశాడు. పుత్రగణపతి విసురుకి మూషికాసురుడు అమాంతంగా అతని రాజ్యంలో అంతఃపురం ముందు దభీమని నిజరూపుతో బోర్లా పడ్డాడు. అతని భార్య ధవళ గొప్ప దేవీభక్తురాలు. ఎప్పటికీ తన పసుపుకుంకుమలు నిలిచేలాగ భర్తకు చావులేని వరం దేవివల్ల పొందింది! ధవళ భర్తను ఊరడించి వరం సంగతి చెప్పి, పార్వతి జోలికి పోవద్దని హితవు చెప్పింది.

* * *

త్రిపురాసురులను సంహరించి ముందుగా వచ్చిన శివుడు పార్వతిని చూడాలనే తహతహతో హుటాహుటిగా వెళ్ళబోతూంటే బాలుడు అడ్డగించాడు. శివుడు చకితుడై, "ఎవరు నువ్వు?" అని గద్దించాడు.

బాలుడు పకపక నవ్వుతూ, "అమ్మ కొడుకుని! మాయావులూ,వేషధారులూ తిరుగుతున్నారు, పురుగైనా పోకుండా కాపలా పెట్టింది, మా అమ్మ!" అన్నాడు.

"నేను ఈశ్వరుణ్ణి, దేవుణ్ణి!" అన్నాడు శివుడు.

"నాకు ఎటువంటి దేవుడితోనూ నిమిత్తం లేదు. అమ్మ ప్రకృతి స్వరూపిణి; ప్రకృతి శాసనాన్ని అనుసరించి నడుచుకోవడం కంటే జీవకోటికి వేరే ధర్మమేదీ లేదుకదా! అమ్మ ఆజ్ఞ పాలించటమే నా విధి!" అన్నాడు బాలుడు.

కొంచెం వెనకనుంచి త్రిపురాసురసంహారం చేసిన శివుడి పరాక్రమ వీరగాథను గానం చేస్తూ జయజయధ్వానాలతో వస్తూన్న ప్రమథగణాలు, ముక్కోటి దేవతలు అక్కడికి చేరుకుని, శివుడు బాలుడితో ఘర్షణ పడుతుండడం చూసి ఆశ్చర్యంతో అలాగే నిల్చిపోయి, వాళ్ళసంవాదం అలాగే వినసాగారు.

"కుర్రకుంకవు, తెలియక దేవుడు లేడంటున్నావు. అంతటికీ మూలము పరబ్రహ్మము, అతడే దేవుడు!" అన్నాడు శివుడు.

"పెద్దవాడివైనా నీకే తెలియనట్టుంది, ఆదిశక్తి నుండి విశ్వమూ, త్రిమూర్తులూ వచ్చిన సంగతిని సూక్ష్మంగా చెబుతాను విను," అంటూ బాలుడు చెప్పసాగాడు:

ఆదిశక్తి రూపుదాల్చి బ్రహ్మను,విష్ణువును, మహేశ్వరుణ్ణి తన మేను విదల్చగా వచ్చిన



ఎరుపు, నీలం, తెలుపురంగుల తేజస్సుల నుండి పుట్టించింది. బ్రహ్మ, విష్ణువు లిద్దరూ దేవి చెప్పింది వినకుండా ధిక్కరించారు. వాళ్ళను ఆమె తన మూడో కంటిని తెరిచి బూడిద కుప్పల్ని చేసింది. మహేశ్వరుడు గడుసువాడు; చెప్పినట్టే వింటాను గాని, ముందు మూడో కన్ను తనకు ఇమ్మన్నాడు. దేవి తన మూడో నేత్రాన్ని తీసి అతని నొసట అతికించింది. వెంటనే అతను దాన్ని తెరిచి ఆవిణ్ణి కాల్చాడు. ఆమె మండిపోతూంటే అగ్ని రేణువులు విరజిమ్ముకుని తేజోమండలాలు ఏర్పడ్డాయి. భస్మం రేగి అంతటా నిండింది. ఆ విధంగా విశ్వం ఏర్పడింది. తర్వాత కాలినట్టే 'కాలిపోయిన దేవి మళ్ళీ యథారూపంలో కనిపించింది. అందుకే ఆమెను 'మహామాయ' అని అన్నారు. మహేశ్వరుణ్ణి మెచ్చుకుని, అతణ్ణి లయకారుడుగా నిర్ణయించింది. బ్రహ్మ, విష్ణువులను వారి బూడిదల నుండి రప్పించింది. కొంత మిగిలివున్న తన బూడిదను మూడు భాగాలుగా వాణిని, లక్ష్మిని, ఉమను రూపొందించింది. వాణిని బ్రహ్మ, లక్ష్మిని విష్ణువు, ఉమను మహేశ్వరుడు అర్ధాంగులుగా స్వీకరించి లోకపాలన చేయండని చెప్పి, దేవి అంతర్ధానమైంది.

''నీవు చెప్పిందంతా ఒట్టి కట్టుకథ!'' అన్నాడు శివుడు.

''నాది కట్టుకథ అయితే బ్రహ్మము దేవుడు అంటూ నీవు చెప్పేదంతా కేవలం మెట్టవేదాంతం అంటే తప్పేముంది? అంతా దేవుడు నుండి పుట్టిందనడం కంటే ఆదిశక్తి నుండి వచ్చిందనడం ఎక్కువ నిజంగా వినిపించడం లేదా!'' అని అడిగాడు బాలుడు.

అతని మాటలకు అక్కడున్న మగవాళ్ళ ముఖాలు వెలవెలపోయాయి. ఒక్క విష్ణువు మాత్రం మెచ్చుకుంటూన్నట్టుగా బాలుణ్ణి చూసి చిరునవ్వు నవ్వాడు. బ్రహ్మ బాలుడి తర్కానికి మురిసిపోయాడు. ఆడవాళ్ళ ముఖాలు కళకళలాడుతూ వికసించాయి.

శివుడు ముఖం ఎర్రగా చేసుకుని, "చూస్తే పసివాడివైతివి, భయపడకు, నిన్నేమీచేయ నులే! మంచిగా ద్వారానికి అడ్డం తొలగిపో!" అన్నాడు కసురుతున్నట్టుగా.

"నా కంఠంలో ప్రాణం ఉండగా నిన్ను వెళ్ళ నిచ్చేదిలేదు!" అన్నాడు బాలుడు నిర్భయంగా.

శివుడికి పట్టరాని కోపం వచ్చింది. చప్పట్లు చరిచి ప్రమథగణాలకు సైగచేశాడు. బాలుణ్ణి ఈడ్చిపారేయడానికి వాళ్ళుముందుకురికారు.

బాలుడు నవ్వుతూ, "పసివాడివంటూ కనికరించినట్లు నటిస్తూ నా మీదకు నీ గణాల్ని బలప్రయోగానికి ఉసిగొల్పడం ఏమైనా బాగుందా? సరే, నేనూ గణాధిపతినే!" అంటూ అంకుశదండాన్ని నేలకు గట్టిగా తాటించాడు. నేల ఈనినట్లు పుత్రగణపతి లాంటి రూపురేఖలుగలవాళ్ళు వేలకు వేలు పుట్టుకొచ్చి, నందినీ, శృంగినీ, భృంగినీ, చండీశ్వరుణ్ణీ తమ చేతుల్లో ఉన్న అంకుశాలు, గదలు, పాశాలు, శూలాలతో గొడ్లను తరిమినట్టు తరిమేశారు. మిగతా శివాను చరులంతా జాడలేకుండా పారిపోయారు. ఆ క్షణమే పుత్రగణపతి గణమంతా అదృశ్య మయ్యారు.

శివుడు రుద్రుడై త్రిశూలం ఎత్తాడు. బాలుడు అంకుశదండంతో అడ్డుకోగా ఖంగున మ్రోగుతూ త్రిశూలం పడిపోయింది. బాలుడు పకపక నవ్వుతూ, "మా అమ్మ ఇచ్చిన దండం నాచేతనుండగా నన్నేమీ చేయలేవు. నీవేదో చేద్దామనుకుంటున్నది నిర్విఘ్నంగా నెరవే ర్చాలనే నేనూ సిద్ధంగా ఉన్నాను, తర్వాత కథ అమ్మ చూసుకుంటుంది!" అంటూ అంకుశ గదాదండాన్ని దూరంగా విడిచి పెట్టాడు.

శివుడు ఒళ్ళు తెలియని కోపంతో ఉన్మత్తుడిలాగ త్రిశూలాన్ని బాలుడి కంఠానికి గురిపెట్టి విసిరాడు. మరుక్షణంలో బాలుడు, "అమ్మా!" అని పెద్దపెట్టున అరుస్తూండగా అతని తల తెగి ఆకాశానికి ఎగిరి పెద్దజ్యోతిగా వెలిగిపోతూ, అంతరిక్షంలో లీనమైంది.





# కష్టేఫలి

పూర్వం ఒకానొక చిన్నపల్లెలో, కష్టజీవి అయిన రైతు ఒకడుండేవాడు. అతడిది చాలా పెద్ద కుటుంబం. తల్లీ, తండ్రీ భార్యా నలుగురు పిల్లలూ కాక, అవిటివాడైన రైతు తమ్ముడు కూడా వారితోబాటే వుండేవాడు. అంతమందిలో ఏ ఒక్కరూ ఏనాడూ పనికి బద్ధకించేవారు కాదు. రైతు తను కష్టపడుతూ, కుటుంబ సభ్యుల్ని కూడా ఓపినంత కష్టపడమనీ, కష్టించడమే సుఖానికి రాచబాట అనీ ప్రోత్స హించేవాడు.

అతడి పొలంగట్టునానుకుని, ఏనాటిదో ఒక పెద్ద మామిడిచెట్టు వుండేది. రైతు మధ్యాహ్నం భోంచేసేటప్పుడు నీడకూ, అతడి ఇంట జరిగే సకల శుభకార్యాలకు మామి డాకు తోరణాలకూ, రుతుకాలంలో పళ్ళకూ ఆ చెట్టు అతడికి ఎంతగానో ఉపయోగ పడుతూండేది.

ఆ మామిడిచెట్టును ఆవహించుకుని, ఒక వనదేవత ఎంతోకాలంనుంచి వుంటు న్నది. అలా కాలం గడుస్తున్నకొద్దీ, ఆ దేవతకు రైతుతోనూ, రైతు కుటుంబంతోనూ పరిచయం బలపడసాగింది. పండిన పంటమీద మంచి లాభాలు వస్తూ, కుటుంబ పరిస్థితి నానాటికీ మెరుగుపడుతున్నప్పటికీ, రైతు దించిన నడుం ఎత్తకుండా కష్టపడుతూ, కుటుంబీకుల్ని కూడా ప్రోత్సహిస్తూండటం దేవత గమనిస్తూ వచ్చింది.

ఒకనాడు వనదేవత, పొలంలో పనిచేస్తున్న రైతుకుటుంబాన్ని చాలాసేపు పరిశీలనగా చూసి, "ఎవరైనా బీదస్థితిలో బాగా కష్టపడి పనిచేస్తారు. పరిస్థితి మెరుగవుతున్నకొద్దీ ఎవరి బుద్ధి అయినా, సుఖాలవైపు మళ్ళటం సహజం! అటువంటిది, ఈ రైతు అప్పటికీ ఇప్పటికీ ఒక్కలాగేవున్నాడు. బహుశా ఇంకా ఇంకా సంపాదించాలన్నది అతడి మితిమీరిన దురాశ ఏమో!" అనుకుని రైతును మరింతగా పరిశీలించడం ప్రారంభించింది.

దేవత ఊహించినట్టే మరికొన్నాళ్ళు గడిచే సరికి, రైతు తాము కష్టించి కూడబెట్టిన సొమ్ముతో, తమ పొలాన్ని ఆనుకునివున్న

లక్ష్మీ గాయత్రి



మరొక ఎకరం పొలాన్ని కొన్నాడు. తొలకరి జల్లులు ప్రారంభంకాగానే, మంచి రోజు చూసుకుని, రైతు కొత్తగా కొన్న పొలాన్ని దున్నటం, దాన్ని దున్నేందుకు రైతు పడుతున్న కష్టం చూసేసరికి, దేవతకు అతడి మీద ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది.

ఆ సాయంత్రం రైతు ఇంటికి తిరిగి బైలుదేరుతూండగా, దేవత అతడికి కనబడి, తానెవరైందీ చెప్పి, "సంవత్సరాల తరబడి ఎండనక వాననక పొలంలో నువ్వు కష్టించడం,నేను చూడలేకపోతున్నాను. నీకు కావలసినంత ధనం ఇస్తాను. కూలీలనుపెట్టి పనిచేయించుకో. ఇకనైనా కాస్త సుఖపడు!" అన్నది.

రైతు, దేవతకు చేతులెత్తి నమస్కరించి నవ్వుతూ, "నా కష్టం చూడలేనిదానివి, కూలీల కష్టం చూడగలవా, తల్లీ! వాళ్ళు మాత్రం నాలాంటి మనుషులు కారా?" అంటూ ప్రశ్నించాడు.

దేవత ఆ మాటలకు కోపం తెచ్చుకోకుండా, "వాళ్ళంతా బతుకుతెరువుకోసం కష్టపడతారు. కానీ, నువ్వు మాత్రం కష్టంలోనే సుఖాన్ని చూసుకుంటూ కష్టిస్తున్నావని, నా అనుమానం! అందుకే నువ్వంటే నాకు అభిమానం. చెప్పు, ఎంత డబ్బు ఇవ్వమంటావు?" అని అడిగింది.

రైతు దేవతకు మరొకసారి నమస్కరిస్తూ, "నేను కష్టించి పనిచేస్తూండటంవల్లనే గదా, నీకు నాపై అభిమానంకలిగింది? నాకుడబ్బిచ్చి, ఆ అభిమానానికి దూరం చేస్తావా, వద్దు! నీ అభిమానమే నాకు లక్షల పెట్టు. ఇంకే డబ్బూ వద్దు," అని అక్కణ్ణించి ముందుకు కదిలాడు.

ఆ తర్వాత రెండు రోజులకు అతడు పొలం దున్నుతూండగా, నాగటి కర్రుకు ఏదో తగిలిన చప్పుడైంది. ఏమిటా అని అక్కడ తవ్విచూసేసరికి, పచ్చటి రాగిరేకు బిగించి వున్న ఇత్తడిబిందె ఒకటి బైటపడింది. రైతు అనుమానిస్తూనే పనిముట్టు తీసుకుని, బిందె మూతికి వున్న రాగిరేకును విడగొట్టి చూశాడు. అతడు అనుమానించినట్టే బిందె నిండా ధగధగలాడుతున్న వెండి కాసులూ, బంగారు కాసులూ వున్నాయి.

వెంటనే రైతు బిందె భుజానికెత్తుకుని, మామిడిచెట్టువద్దకు వెళ్ళి నిలబడి, "తల్లీ! ఓ దేవతమ్మా," అంటూ కేకవేశాడు.

"పిలిచావా? ఏమిటి?" అంటూ దేవత మరుక్షణం అతడిముందు ప్రత్యక్షమైంది.

రైతు బిందెలోని నిధిని దేవతకు చూపిస్తూ, "ఇది నీ పనేనా?" అన్నాడు.

దేవత అమాయకంగా, "ఏమిటిది, నాకేం తెలియదే!" అన్నది.

రైతు నవ్వుతూ, "చాలా సంవత్సరాల

నుంచి, నా పొలాన్ని దున్నుకుంటున్నా. ఏమూల ఏ రకం గడ్డిపరక వుందో కూడా నాకు తెలుసు. సరే, నీకు కావలసిందల్లా, నేను కూలీలనుపెట్టి పనులు చేయించటం గదా!'' అని బిందె తీసుకుని తిరిగివెళ్ళాడు.

రైతుకు తెలియకుండా అతడి పొలంలో నిధి పెట్టిన దేవత, అతడి మాటలకు నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

మరుసటిరోజు ఉదయాన రైతుతోబాటు పదిమంది ఆడామగా కూలీలు రావడం చూసి దేవత చాలా ఆనందపడింది. అయితే, ఆమె ఆనందం ఎంతోసేపు నిలవలేదు. వచ్చిన కూలీల్లో ఇద్దరే కాస్త పనికి తగినవాళ్ళు. మిగతావాళ్ళు వృద్ధులూ, ఏదో ఒక అంగ వైకల్యం కలవాళ్ళు.

రైతు, కూలీలందరికీ తలా ఒక పని అప్పజెప్పాడు. తను వాళ్ళతో కలిసి పనిచేశాడు. మధ్యాహ్నంవేళ రైతు భార్య వండి తెచ్చిన అన్నం, కూరలను అందరూ కలిసి, మామిడి చెట్టుకింద కూర్చుని తిన్నారు.

ఆ తర్వాత ఒక అరగంటసేపు అందరూ తమ తమ కష్టసుఖాలు చెప్పుకున్నారు. రైతు వాళ్ళ సమస్యలూ, ఈతిబాధలూ విని తోచిన సలహాలిచ్చాడు. చేతనైనంత ధైర్యం చెప్పాడు. చివరగా, ''ఏమైనప్పటికీ ఒకేమాట గుర్తుంచుకోండి. మనిషిని దేవుడు సృష్టించింది బద్ధకంగా కాలం గడపమని కాదు. ఓపినంత శ్రమించి సుఖించమని. అందుచేత, మనం మన కంఠంలో ప్రాణం వున్నంతకాలమూ చేతనైన కష్టం చేస్తూనే వుండాలి. కష్టించేవాణ్ణి తోటివాళ్ళు గౌరవిస్తారు. దేవుడు మాత్రం మెచ్చుకుంటాడు!'' అంటూ వాళ్ళకు హిత బోధ చేశాడు.సాయంత్రం సూర్యాస్తమయ వేళకు కొంచెం ముందుగా రైతూ, కూలీలూ



పనులు కట్టిపెట్టేశారు. తర్వాత రైతు, వాళ్ళను పొలంగట్టు మీద నిలబడమని, పొలానికి ఎడంగా వున్న చిన్న పాకలోకి వెళ్ళాడు. అక్కడ అతనేం చేస్తాడో చూద్దామన్న కుతూహలం కొద్దీ, దేవత అతడి వెనకాలే వెళ్ళింది.

రైతు, పాకలోపల గోనెసంచులు కప్పిపెట్టి వుంచిన ఇత్తడి బిందెలోంచి, ఇన్ని వెండి కాసులు తీసుకుని కూలీల దగ్గరకు వచ్చి, వాళ్ళకు న్యాయంగా రోజుకూలీ ఎంతవస్తుందో అంతా ఇచ్చేశాడు.

''అబ్బే, డబ్బు విషయంలో ఈ రైతు పీనాసితనం చూపించలేదు! మరి కుంటీ, బక్కా కూలీల్ని ఎందుకు తెచ్చినట్టూ!'' అని దేవత తనను తాను ప్రశ్నించుకున్నది.

కూలీలంతా వెళ్ళిపోయాక, రైతు మామిడి చెట్టుదగ్గరకువచ్చి, ''తల్లీ, దేవతమ్మా!'' అని

కేకపెట్టాడు. "ఇక్కడే వున్నాను!" అని దేవత అతడి ముందు ప్రత్యక్షమైంది.

"చూశావా, నా పొలంలోకి కూలీలు వచ్చి పనిచేశారు. ఇప్పుడు నీకు సంతోషమయిందా?" అంటూ ప్రశ్నించాడు రైతు.

"సంతోషమా! నువ్వు క్షణం కూడా తీరుబడిగా కూర్చోలేదే. మరి కూలీలనెందుకు తెచ్చినట్టూ?" అని అడిగింది దేవత.

"అదీ, అలాఅడుగుచెబుతాను!" అంటూ రైతు చెట్టు మొదట్లో చతికిలబడి, "ఇవ్వాళ నా పొలంలోకి వచ్చినవాళ్ళకు సరిగ్గా పని చెయ్యలేరని, ఎవరూ వాళ్ళకు పని ఇవ్వరు. వాళ్ళలో కాస్త శుభ్రంగావున్న ఇద్దర్ని చూశావా! వాళ్ళు పరమ బద్ధకస్తులు, పని దొంగలు. అందుచేత వాళ్ళకూ ఎవరూ పని ఇవ్వరు. నేను దగ్గరుండి వాళ్ళచేత పని చేయించాను. అందరికీ నువ్విచ్చినడబ్బు కూలిగా ఇచ్చాను. ఇప్పుడు చెప్పు, నీకు సంతోషమయిందా?" అంటూ నవ్వుతూ ప్రశ్నించాడు.

అప్పుడు దేవత , "నీ మాటలు పూర్తిగా బోధపడ్డాక సంతోషమైంది, రైతు పెద్దయ్యా! దేవతల్లో నాలాంటి జడస్వరూపులూ, మనుషుల్లో నీలాంటి దేవతామూర్తులూ వుంటారని తెలిసి చాలా ఆనందంగావుంది. నువ్విలాగేవుండి ఇలాంటి మంచి పనులే చేస్తూవుండు. నీకు కావలసిన డబ్బు నేనిస్తూంటాను," అన్నది.

ఆ మాటలు వింటూనే రైతు చేతులు జోడిస్తూ, "అంతపని చెయ్యకు తల్లీ! తేరగా వచ్చేడబ్బుంది చూశావూ, అది మహాపాపిష్టిది. రేపో మాపో నీకూ నాకూ జగడం పుట్టించినా పుట్టిస్తుంది. అదిగో, ఆ కొత్తగా కొన్న పొలం కూడా విరగ పండిందంటే, కూలీలకిచ్చే కూలి డబ్బు కూడా నేనే సంపాయిస్తాను. అప్పుడు నేనూ, కూలీలూ కలిసి మరింత కష్టపడి మరింత పొలం సంపాయిస్తాం. నువ్వు ఈ చెట్టు మీదినుంచి అంతా చూస్తూ, నన్ను దీవిస్తూ వుండు. అంతేచాలు!" అన్నాడు.

దేవత అతడి మాటలు వింటూ, అతడి మొహంలో కనిపిస్తున్న ఆత్మవిశ్వాసాన్నీ, ఆత్మగౌరవాన్నీ చూస్తూ పరమానందభరితురాలైంది.

"నిజమే, కష్టేఫలి! కష్టించేవాడికి ఇహమూ, పరమూ అంతా ఫలవంతమే!" అనుకుంటూ, రైతును ఆశీర్వదించి, అంతర్ధానమైంది.





# వీర్రాజు ధైర్యం

ఐనవరం గ్రామంలో ఉండే నారయ్య కోపంతో ఊగిపోతూ, పొడవాటి కత్తినొకదాన్ని తీసుకుని, ఇంటిముందున్న బండరాయి మీద పదును రావడంకోసం కసిగా నూరుతున్నాడు. అంతకుముందు రోజు నారయ్యకు, తన పక్కపొలం వాడయిన వీర్రాజుతో చిన్న విషయం మీద తగాదా వచ్చి, అది కాస్తా పెద్దదై, ఇద్దరికీ బాగా గొడవ జరిగింది. ఆ సమయంలో నారయ్య బాగా రెచ్చిపోయి, "వీర్రాజూ! నిన్ను కత్తితో పొడిచి చంపకపోతే, నా పేరు నారయ్యకాదు. ధైర్యానికీ, పౌరుషానికీ పరగణా పరగణా అంతా పేరు మోసిన పెదభీమయ్య వంశంవాణ్ణే కాదు!" అని ప్రతిజ్ఞచేసి ఇంటికి తిరిగి వచ్చేశాడు.

నారయ్య కత్తికి పదునుపెడుతూ మధ్యమధ్యలో, వీర్రాజును తిడుతూనేవున్నాడు. ఈ సంగతి గ్రామంలో నలుగురికీ తెలియడంతో, ఏదో వినోదం చూడబోతున్నట్టు కొందరు అతడి ఇంటి ముందు చేరారు.

ఒకరిద్దరు పెద్దమనుషులు అక్కడికి వచ్చి నారయ్యతో, "ఇరుగుపొరుగు రైతులు! ఆ వీర్రాజుతో గొడవెందుకు?" అని చెప్పి చూశారు.

కానీ నారయ్య వాళ్ళమాటలు లెక్క చెయ్యకుండా కత్తి తీసుకుని వీర్రాజు ఇంటికి బయలుదేరాడు. ఏదో చోద్యం చూడబోతున్న వాళ్ళలా కొందరు పిల్లలు ఉత్సాహంతో అతడి వెనకనే నడవసాగారు. తీరా నారయ్య, వీర్రాజు ఇంటి ముందుకు వెళ్ళాక, అతడు ఇంట్లో లేడనీ, పొలంలోని కల్లం దగ్గర ఉన్నాడనీ తెలిసింది. నారయ్య కత్తిని ఒకసారి గట్టిగా ఝళిపించి, వీర్రాజును పెద్దగా తిడుతూ కల్లంకేసి బయలుదేరాడు. ఆసరికి గ్రామంలోని పెద్దవాళ్ళు కొందరు అక్కడికి చేరారు.

వీర్రాజు కల్లం గట్టుమీద కూర్చుని వేపపుల్లతో పళ్ళు తోముకుంటున్నాడు. కత్తి చేతబట్టుకుని, తనమీద కారాలూ మిరి

దాసరి వెంకటరమణ

యాలూ నూరుతూ వస్తున్న నారయ్యను చూసి అతడేమాత్రం తొణకలేదు. ఒకసారి అతడికేసి చూసి, వెంటనే తల తిప్పుకొని తన కేం పట్టనట్టు నింపాదిగా పళ్ళు తోముకో సాగాడు.

నారయ్య, పెద్దపెద్ద అంగలతో, కత్తిని గాల్లో గిరగిరా తిప్పుతూ వీర్రాజును సమీపిస్తూనే ఒక గావుకేకపెట్టి, "ఒరేయ్, ఇంత వరకూ నువ్వు, నన్ను గమనించినట్టు లేదు. నా చేతిలో వున్న కత్తిని చూడు! దీనికి ఇంతకుముందే మరికాస్త పదును పెట్టాను. నిన్ను పొడిచి, ముక్కలు ముక్కలుగా నరుకుతాను!' అంటూ కత్తిని పైకెత్తాడు.

ఓహో, నారయ్య ఏవో బీరాలు పలకడం కాదు; నిజంగానే వీర్రాజును పొడవబోతున్నాడు అనుకుని, వెంటవున్న పెద్దవాళ్ళలో నలుగురైదుగురు, నారయ్యను వడిసి పట్టుకుని దూరంగా లాక్కుపోయారు.

ఇంత జరుగుతున్నా వీర్రాజులో ఏమాత్రం చలనంలేదు. కనీసం నారయ్యకేసి చూడనైనా చూడలేదు. ఇది గమనించి ఆశ్చర్యపోయిన శీనయ్య అనేవాడు, వీర్రాజు దగ్గరకు వెళ్ళి, "ఇదేమిటయ్యా! నారయ్య నరుకుతానని అంత పొడవాటి కత్తి తీసుకుని మీదిమీదికి వస్తూంటే, ఏం పట్టనట్లు చలనం లేకుండా కూర్చున్నావు. ఆహా, ఎంత ధైర్యం నీది!" అన్నాడు.

ఈ లోపల నారయ్య తనను పట్టుకున్న వాళ్ళను వదిలించుకోవడానికి గింజుకుంటూ, "నన్ను వదలండి! ఈ వీర్రాజుగాడికి భూమ్మీద



నూకలు చెల్లినై. ఇదే, నరికి పోగులు పెట్టే స్తాను,'' అంటూ హుంకరిస్తున్నాడు.

వీర్రాజు గింజుకుంటున్న నారయ్యను, శీనయ్యకు చూపుతూ, ''శీనయ్యా! ఇప్పుడు నీకొక వింతచూపిస్తాను. వెళ్ళి, వాణ్ణిపట్టుకున్న వాళ్ళతో వదిలెయ్యమని మెల్లిగా చెప్పు,'' అన్నాడు.

కత్తి తిప్పుతూ, వాణ్ణి పొడుస్తా, నన్ను వద లండి-అంటూ రంకెలు వేస్తున్న నారయ్యను వదిలిపెట్టమంటాడేమిటి? వీర్రాజుకు ప్రాణా లంటే తీపిలేదా? ఏమిటీమొండిధైర్యం, అని ఆశ్చర్యపోతూ, అయినా ఏం జరుగుతుందో చూద్దామని శీనయ్య, నారయ్యను పట్టుకున్న వాళ్ళల్లో ఒకడికి రహస్యంగా, అతణ్ణి వదిలి వేయమని చెప్పాడు.

ఆ మరుక్షణం,నారయ్యను బలవంతంగా ఆపుతున్నవాళ్ళు ఒక్కసారిగా అతణ్ణి వదిలే శారు. అంతే! హఠాత్తుగా అందరూ వదిలే సరికి నారయ్య దభీమంటూ బోర్లాపడి లేచి, కత్తిని వీర్రాజుకేసి గురిపెట్టి చూపుతూ, అడుగులో అడుగువేస్తూమెల్లిగా వీర్రాజుకేసి కదిలాడు.

అయితే, ఈసారి తనను ఆపడానికి ఎవరూ రావడంలేదని గమనించి,ఆగిపోయి వీర్రాజుతో, ''ఒరే, వీర్రాజూ! మరికొద్ది రోజులు నీకీ భూమ్మీద నూకలున్నవి. ఇంతమంది జనం చూస్తూండగా నిన్ను చంపి, కారాగారంలో పడడమో, ఉరికంబం ఎక్కడమో నేను చేయ దలచలేదు. నీ సంగతి ఇప్పుడు కాదు, తర్వాత చూస్తాను!'' అంటూ కేకపెట్టి, గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

అప్పుడు వీర్రాజు అక్కడ చేరినవాళ్ళతో, ''చూశారు గదా, మీరందరూ వదిలెయ్యగానే తోకముడుచుకుని ఎలా వెళ్ళిపోతున్నాడో! వాడు మీరందరూ పక్కన వుండడంతో, తప్పకుండా పట్టుకుని ఆపుతారని భావించి, కేవలం కత్తి చూపించి నన్ను బెదిరించడానికి వచ్చాడు. అంతే. చంపడానికి వచ్చేవాడు, జనాన్ని ఊరేగింపుగా వెంట తీసుకురాడు గదా. అరిచేకుక్కలు కరవవు. కరిచే కుక్కలు అరవవు అన్న సామెత మనందరికీ తెలిసిందే గదా!'' అన్నాడు.

ఆ మాటలతో,అక్కడ చేరిన గ్రామస్థు లందరికీ, వీర్రాజు ధైర్యానికి కారణం అర్థమైంది.



# మా నాన్న అటుకపై లేరు!



దక్షిణ సముద్రతీరంలో కన్నప్ప అనే చిన్న వ్యాపారి ఉండేవాడు. అతనికిభార్యా, మూడేళ్ళ కొడుకూ ఉన్నారు. తప్పటడుగులు వేసే నాటినుంచే ముద్దుముద్దుగా మాట్లాడే కొడుకంటే కన్నప్పకు చెప్పలేనంత ప్రేమ. వాడి మాటలను తాను విని ఆనందించడమే కాదు; ఇంటికి వచ్చిన బంధువులూ, మిత్రుల ఎదుట కూడా వాణ్ణి మాట్లాడించి వాళ్ళను వినమని బలవంతపెట్టి మురిసి పోయేవాడు.

కన్నప్ప ప్రత్తినీ, ప్రత్తి గింజలనూ కొని, మారుబేరానికి అమ్మేవాడు. పక్క పట్టణంలో ప్రత్తి విరివిగా వచ్చి దిగిందనీ, చేతిలో రొక్కం వుంటే చౌకధరకు కొనవచ్చుననీ వ్యాపార మిత్రుడొకడు అతనికి చెప్పాడు. తనవద్ద చాలినంత డబ్బు లేకపోవడం వల్ల, కన్నప్ప వడ్డీవ్యాపారి వద్దకు వెళ్ళి, మూడు నెలల లోగా వడ్డీతోసహా తిరిగి చెల్లిస్తానని ఐదు వందల రూపాయలు అప్పు తెచ్చాడు. ఆ డబ్బుతో వచ్చినంత ప్రత్తిని కొని తెచ్చాడు. "సరుకును ఇప్పుడంతా ముట్టుకోను. ధర బాగా పెరిగాక అమ్మితే మంచి లాభాలు వస్తాయి. ఆ తరవాత చూడు మన దశ తిరుగు తుంది, నన్ను మించినవాడుండడు," అంటూ భార్యతో గొప్పగా చెప్పాడు.

మరునాడే వెళ్ళి పట్నంలో ఒక పెద్ద గిడ్డంగిని అద్దెకు తీసుకుని కొన్న ప్రత్తిని అందులో భద్రపరిచాడు.

నెలరోజులు గడిచాయి. ఒకనాడు తెల్ల వారకముందే ఆకాశం మేఘావృతమయింది.

చిలికి చిలికి గాలివాన సాయంకాలానికి తుఫానుగా మారింది. ఆ తుఫాను దెబ్బకు పెద్దపెద్ద చెట్లు నేలకూలాయి. ఇళ్ళ కప్పులు ఎగిరిపోయాయి. కన్నప్ప ప్రత్తిగిడ్డంగి పైకప్పు ఒకవైపు ఎగిరిపోవడంతో వర్షానికి ప్రత్తంతా తడిసి ముద్దయింది.

దానిని చూసిన కన్నప్పకు మతి తప్పినంతపనయింది. కాలుకాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతూ, "ఇప్పుడేం చేయను? గిడ్డంగివాడికి అద్దె చెల్లించాలి. వచ్చే నెలలో వడ్డీవ్యాపారి అప్పు తీర్చాలి. కాదంటే ఒప్పుకునే ఘటం కాదు!" అని భార్యతో వాపోయాడు.

"ఒకపని చేయండి. మీరు ఆ వ్యాపారికి ఇవ్వాల్సిన డబ్బు కూడబెట్టేంతవరకు మన ఊరు వదిలి వెళ్ళండి. కావాలంటే ఉత్తరాదిన ఉన్న మన బంధువుల ఇళ్ళకే వెళ్ళవచ్చు. వాళ్ళు ఇక్కడికి వచ్చినప్పుడల్లా, తమ ఇళ్ళకు రావడం లేదని బాధపడుతూ ఉంటారు కదా? పైగా వాళ్ళనుంచి అప్పు రూపంలో ధన సహాయం కూడా అడగవచ్చు. మన పరిస్థితి తెలిస్తే సాయపడగలరనుకుంటాను," అని సలహా ఇచ్చింది భార్య.

"నిజమే, రెండు మూడు నెలల తరవాత ఇస్తానని వాళ్ళనుంచి డబ్బు తెస్తే, వడ్డీ వ్యాపారి గండం నుంచి బయటపడవచ్చు. నేను ఈ రోజే బయలుదేరుతాను," అన్నాడు కన్నప్ప.

మరునాడే కన్నప్ప ప్రయాణమవుతూ కొడుకుతో, "నాన్నా! నేను మన బంధువుల ఊరు వెళ్ళి వస్తాను. వచ్చేప్పుడు నీకు ఆడుకునేందుకు కావలసినవన్నీ తెస్తాను," అని చెప్పి వెళ్ళాడు.

మూడు నెలల గడువు పూర్తికాగానే, వడ్డీవ్యాపారి వచ్చి, కన్నప్పను గురించి అతని భార్యను అడగ్గా — తన భర్త బంధువుల ఊరు వెళ్ళాడనీ, ఒక వారం తరవాత వస్తాడనీ ఆమె చెప్పింది.

"అవునవును, వచ్చేప్పుడు మా నాన్న నాకు కావలసిన ఆటవస్తువులన్నీ తెస్తానని చెప్పాడు!" అన్నాడు అమ్మ కొంగుపట్టుకుని నిలబడ్డ కొడుకు.



వడ్డీవ్యాపారి వాడికేసి చూస్తూ చిన్నగా నవ్వి, తరవాత కన్నప్ప భార్యతో, ఒక వారంలోగా తన బాకీ చెల్లించాలని హెచ్చరించి వెళ్ళాడు.

ఆరోజు రాత్రి ఊరంతా మాటు మణిగాక ఎవరూ చూడకుండా కన్నప్ప ఇంటికి తిరిగి వచ్చాడు. డబ్బు లభించిందా అని అడిగింది భార్య. లేదన్నాడు కన్నప్ప. "నువ్వు ఏంచేస్తావో, ఏమో నాకు తెలియదు. మరో మూడు రోజుల్లో ఆ వడ్డీవ్యాపారి తన మనుషులతో మన ఇంటిమీదికి రావడం ఖాయం!" అన్నది భార్య.

మళ్ళీ ఎక్కడికయినా పారిపోదామా అనుకున్నాడు కన్నప్ప. కానీ వడ్డీవ్యాపారి

మనుషులు కన్నప్ప ఇంటిమీద ఒక కన్ను వేసి ఉంచారు. తెల్లవారేసరికల్లా కట్టకట్టుకు వచ్చి, కన్నప్ప ఇంటితలుపు తట్టారు. కన్న ప్పకు వలలో చిక్కుకున్నట్టయింది. డబ్బు లివ్వకుండా వాళ్ళ కంటబడితే, దేహశుద్ధి చేస్తారేమో అని భయపడ్డాడు. భార్యతో, 'నేను అటకమీదికి ఎక్కి దాక్కుంటాను. వచ్చిన మొరటు వెధవల్ని తిప్పి పంపడానికి ప్రయత్నించు,'' అంటూ గబగబా అటక పైకి ఎక్కాడు.

కన్నప్ప కొడుకు దీన్నంతా గుడ్లప్పగించి చూస్తున్నాడు.

వడ్డీవ్యాపారి వెంట వచ్చిన మనుషుల ఓర్పు నశించింది. తలుపును దబదబా బాదసాగారు. కన్నప్ప భార్య తలుపు తెరిచి, వెలుపలికి చూస్తూ, ''ఎవరు మీరు? ఎందు కలా తలుపును విరగబాదుతున్నారు?'' అన్నది కోపం నటిస్తూ.

'మేము ఎవరమా? నీ భర్తను పిలువు చెబుతాడు వివరంగా,'' అన్నాడు వడ్డీవ్యాపారి వెటకారంగా.

''ఆయన ఇంట్లో లేరు! కావాలంటే మీరే వచ్చి లోపల చూసుకోండి!'' అన్నది కన్నప్ప భార్య తొణక్కుండా.

వడ్డీవ్యాపారితోపాటు ఆయన మనుషులు ఇంట్లోకి జొరబడి కన్నప్పకోసం ఇల్లంతా వెతకసాగారు. వాళ్ళ వెంటే కన్నప్ప కొడుకు కూడా వెళ్ళాడు. వాళ్ళ కంటికి కన్నప్ప కనిపించ లేదు. తన తండ్రీ, వాళ్ళూ దాగుడుమూత లాడుకుంటున్నారని అనుకున్నాడో ఏమో, కన్నప్ప కొడుకు తన తండ్రికి సాయం చేద్దా మని, ఉన్నట్టుండి, ''మా నాన్న అటకపై లేరు!'' అన్నాడు.

వడ్డీవ్యాపారి తల పైకెత్తి అటక కేసి ఒక్క క్షణం చూసినవ్వాడు. అదే నవ్వుతో అమాయక మైన ఆ బిడ్డ ముఖంచూసి, వాడి బుగ్గగిల్లాడు. అసలు విషయం గ్రహించి ఫక్కున నవ్వాడు. ఆ తరవాత కన్నప్ప భార్యతో, 'మొదట నీ భర్తను కిందికి దిగి రమ్మను. బాకీ తీర్చడానికి నేను మరొక నెల రోజులు గడువిస్తున్నానని చెప్పు,'' అంటూ ఇంటి బయటకు నడిచాడు. ఆయన మనుషులు కూడా ఆయన వెంట నడిచారు.



ఆ ఇంటి వాకిలి దాటి వడ్డీవ్యాపారి తిన్నగా వీధిలో అడుగుపెట్టాక, భుజాలు ఎగురవేస్తూ, ''మా నాన్న అటకపై లేరు! మా నాన్న అటకపై లేరు!'' అంటూ నవ్వుతూ నడవసాగాడు.


13
అజేయుడు గరుడుడు!
చిత్రాలు: పాణి
తమ రాజును ఎవరో అపహరించుకు పోయారని తెలియగానే చంద్రపురి ప్రజలు బాధతో విలవిలలాడి పోయారు. తాంత్రికవేత్త నాగబంధును కలుసుకుని రాజును గురించి మరిన్ని వివరాలు సేకరించడానికి, సేనాధిపతి నరేంద్రదేవుడు అడవులకేసి బయలుదేరాడు. భటులు ఆదిత్యుణ్ణి అతని శయన మందిరంలో వెదకడానికి వెళ్ళి చావుదెబ్బలతో బయటపడి పారిపోయారు.


ఆదిత్యుడి శయనమందిరంలోకి ప్రవేశించిన రవీంద్రదేవుడు, భటులు వెతుక్కుంటూ వచ్చినప్పుడు ఆదిత్యుడు ఎక్కడికి వెళ్ళాడో అడిగాడు.
నేను ఇక్కడే నా గదిలో ధ్యానంలో కూర్చుని ఉన్నాను. అయినా, నీ భటులు నన్ను వెతుక్కుంటూ ఎందుకు వచ్చారు?
నువ్వు అప్పుడు నీ గదిలో లేవు, లేవు! అదిసరే. ఇప్పుడు రాజుగారు ఎక్కడున్నాడో చెప్పు.


అది చాలా రహస్యం అని ఎప్పుడో చెప్పాను కదా? నేను రాజుగారికి ద్రోహం తలపెట్టలేను!
రహస్యమా? అర్థం లేకుండా మాట్లాడకు! నువ్వేదో సాధించడానికి రాజును ఎక్కడో దాచావని నాకు తెలుసు. ఆయన మా మహారాజు!

రవీంద్రదేవుడు కత్తి దూసి నిరాయుధుడైన ఆదిత్యుడి మీదికి ఉరికాడు.

నీలాంటి నీచులను ఎలా అదుపులో పెట్టాలో నాకు తెలుసు!

ఆదిత్యుడు మెరుపులా ఒక్క ఎగురున దూకి దూరంగా నిలబడ్డ భటుడి చేతిలోని బల్లాన్ని లాక్కున్నాడు.

కతిని దూరేంగా పడెయ్!

నన్ను చంపొద్దు ఆదిత్యా!

ఆదిత్యుడు, రవీంద్రదేవుడి కత్తిని అందుకుని భటులకేసి చూశాడు. వాళ్ళు బెదిరి పారిపోయారు. ఆదిత్యుడు తలుపు మూసి లోపలినుంచి గడియపెట్టాడు.

రవీంద్రదేవుడు ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు. ఆ తరవాత ప్రాణభయంతో వణికిపోసాగాడు.







గదికి వెలుపలనున్న రక్షకభటులు తలుపును పగలగొట్టడానికి పెద్ద దుంగను మోసుకువచ్చారు.



రవీంద్రదేవుణ్ణి ఆసనానికి బంధించిన తరవాత...



ఆదిత్యుడు హఠాత్తుగా తలుపు తెరిచాడు. భటులు ఒక్క ఊపుతో దుంగతోసహా వెళ్ళి లోపలపడ్డారు. అదే సమయంలో ఆదిత్యుడు వెలుపలికి వచ్చి, తలుపుకు గొళ్ళెం పెట్టి రాజును చూడడానికి బయలుదేరాడు.






అక్కడ సేనాధిపతి రవీంద్రదేవుడు తన అనుచరులతో కొండల మధ్య రెండు రోజుల ప్రయాణం తరవాత పురాతన ఆలయ ప్రాంగణాన్ని సమీపించాడు.


తాంత్రికవేత్త నాగబంధు భక్తులు, నాగపంచమి ఉత్సవాల కోసం తెచ్చిన కానుకలతో వరుసలుతీరి ఉండడం కనిపించింది.


నాగబంధు శిష్యులలో ఒకడు, కొత్తగా వచ్చిన నరేంద్రదేవుణ్ణీ, అతడి అనుచరులనూ పరిశీలనగా చూస్తూ వాళ్ళను సమీపించాడు.
దయచేసి గుర్రంపై నుంచి దిగి, అందరితో పాటు వరుసలో నిలబడండి. మా గురువుగారికి క్రమశిక్షణ చాలా ముఖ్యం. ఆయన సూచనలను తు.చ. తప్పకుండా పాటించాలి.
(ఇంకావుంది)

## Statement about Ownership of CHANDAMAMA (Telugu)

Rule 8 (FormVI), Newspaper (Central) Rules, 1956

| | |
|---|---|
| 1. Place of Publication | 82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |
| 2. Periodicity of Publication | MONTHLY<br>1st of each calendar month |
| 3. Printer's Name<br>Nationality<br>Address | B. VISWANATHA REDDI<br>INDIAN<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |
| 4. Publisher's Name<br>Nationality<br>Address | B. VISWANATHA REDDI<br>INDIAN<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |
| 5. Editor's Name<br><br>Nationality<br>Address | B. VISWANATHA REDDI<br>(Viswam)<br>INDIAN<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |
| 6. Name and Address of individuals who own the paper | Chandamama India Ltd.<br>Board of Directors:<br>1. P. Sudhir Rao<br>2. Vinod Sethi<br>3. B. Viswanatha Reddi<br>82 Defence Officers Colony<br>Ekkatuthangal<br>Chennai-600 097 |

*I,* **B, Viswanatha Reddi,** *do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

1st March 2002

B. VISWANATHA REDDI
*Publisher*



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు మే 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

జనవరి 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
శ్రీమతి జి. పుష్పలత
W/o. టి.జె.మోహన్‌కుమార్
న్యూ బాకారం, హైదరాబాద్-500 020.

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో : ఏమిటా సంకేతం?
రెండవ ఫోటో : అందించేవా సందేశం!




Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

